# కొన్ని తెలంగాణ వ్యాసాలు

కె. బాలగోపాల్



కొన్ని

# తెలంగాణ

వ్యాసాలు

కె. బాలగోపాల్



మట్టి ముద్రణలు । ఆలగడప । తెలంగాణ

# కొన్ని తెలంగాణ వ్యాసాలు


కె. బాలగోపాల్

ప్రచురణ సంఖ్య : 25

ముద్రణ : అక్టోబర్ 2016

డిజైనింగ్, బుక్ మేకింగ్ : జుగాష్విలి

డి.టి.పి. : మోని శ్రీనివాస్

సాంకేతిక సహకారం : టి. మల్లేష్

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్

ప్రచురణ

మట్టి ముద్రణలు
ఆలగడప, మిర్యాలగూడ
నల్లగొండ జిల్లా – 508207, తెలంగాణ
ఫోన్ : 9848015364

ప్రతులకు
పుట్ట పుస్తక శిబిరం, ఆలగడప, మిర్యాలగూడ
మరియు
అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు
బాలగోపాల్ రచనల కోసం : www.balagopal.org

**వెల : 50 రూపాయలు**

# పరి పరి దండాలు

బాలగోపాల్‌ను, తెలంగాణను వేరు చేసి చూడలేం. అలాగని తెలంగాణకే పరిమితమూ చేయలేం.

దాదాపు నాలుగు దశాబ్దాల పాటు అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ, విప్లవ, స్త్రీ, దళిత, బహుజన, ఆదివాసీ, మైనారిటీ, పర్యావరణ, వర్గీకరణ, జలసాధన వంటి అన్ని హక్కుల ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలబడ్డవాడు. వారందరి పోరాటాలలోనూ పాలు పంచుకున్నవాడు.

బాలగోపాల్ నడవని నేల లేదు. తొక్కని గడప లేదు. తట్టని తలుపు లేదు. తడమని సమస్య లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే అన్నిటినీ ఔపోసన పట్టి తనదైన తాత్విక దృక్పథంతో వాటికి పరిష్కారాలు సూచించినవాడు.

సీమాంధ్ర పాలనలో తెలంగాణ తీవ్రంగా నష్టపోయిన నీళ్లు, నిధులు, నియామకాల గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేసి, తాను ఆకళింపు చేసుకున్న వాటిని సమదృష్టితో వ్యాఖ్యానిస్తూ, ఇతరులకు అవగాహన కల్పిస్తూ తెలంగాణ మలిదశ ఉద్యమాన్ని నెత్తికెత్తుకున్నవాడు. తెలంగాణ ప్రజల రాష్ట్ర ఆకాంక్షను, అనివార్యతను ఎప్పటికప్పుడు సీమాంధ్రలోనూ విడమరిచి చెపుతూ, న్యాయమైన తెలంగాణ డిమాండ్లకు ఒక ప్రజాస్వామిక వాతావరణాన్ని ఏర్పరచినవాడు. మద్దతు కూడగట్టినవాడు.

బాలగోపాల్ రాసిన వందలాది వ్యాసాలలో, మాట్లాడిన వేలాది ఉపన్యాసాలలో తెలంగాణ ఉంది. 'కల్లోల కథాచిత్రాలు' నుంచి 'జలపాతాలు', 'అభివృద్ధి-విధ్వంసం' వరకు ఇప్పటిదాకా వచ్చిన ఆయన అన్ని పుస్తకాల్లోనూ తెలంగాణ ఉంది. అయినా మలిదశ తెలంగాణ ఉద్యమ సందర్భంలో పూర్తిగా తెలంగాణ మీదనే రాసిన కొన్ని

వ్యాసాలను విడిగా ఒక చిన్న పుస్తకంగా తీసుకొద్దామనుకున్నాం. అదే ఈ 'కొన్ని తెలంగాణ వ్యాసాలు'.

బాలగోపాల్, మనమూ కోరుకున్న తెలంగాణ ఇది కాదు. బాలగోపాల్ ఆనాడే చెప్పిన విషయాలను పట్టించుకొని, చేసిన వ్యాఖ్యానాలను మననం చేసుకుంటూ గమనం కొనసాగిస్తే మనం ఎప్పటికైనా మన గమ్యం చేరుకుంటాం. మన లక్ష్యం నెరవేరుతుంది. మన తెలంగాణ సిద్ధిస్తుంది.

**వేనేపల్లి పాండురంగారావు**

మట్టి ముద్రణలు

# ఇదీ వరుస

# తెలంగాణ రాయలసీమ ఉత్తరాంధ్రల గోడు విందాం ప్రాంతీయ వివక్షకు వ్యతిరేకంగా ఆందోళన చేద్దాం

ప్రాంతీయ వివక్ష గురించి, అసమానతల గురించి రాష్ట్రంలో మళ్ళీ చర్చ బాగా జరుగుతూ ఉంది. ప్రత్యేక తెలంగాణ సాధన కోసం తెలంగాణ ప్రాంతంలో అనేక కమిటీలు, వేదికలు ఏర్పడ్డాయి. తమ ఆందోళనకు ప్రజాఉద్యమ రూపం ఇవ్వాలని వారు ప్రయత్నిస్తున్నారు. రాయలసీమవాసులు కూడా అదే స్థాయిలో కాకున్నా తాము అనుభవిస్తున్న వివక్ష గురించి మాట్లాడుతున్నారు. ఆల్మట్టి, ఎగువతుంగ వివాదాలు కృష్ణా నదీజలాల పంపకంలో మన రాష్ట్రంలో జరిగిన అన్యాయాన్ని మరొకసారి చర్చకు తెచ్చాయి. ఉత్తరాంధ్రవాసులు కూడా తమకు సమైక్య రాష్ట్రంలో ఒరిగిందేమిటి అని ప్రశ్నించడం మొదలుపెట్టారు.

అన్యాయానికి గురయినవాళ్ళు తమకు జరిగిన అన్యాయాన్ని గుర్తించి ఆందోళన చేయడం ఎంత ముఖ్యమో, ఇతరులు ఆ అన్యాయాన్ని అర్థం చేసుకొని దానికి వ్యతిరేకంగా జరిగే ఆందోళనలోని న్యాయమైన ఆకాంక్షను గుర్తించడం కూడా అంతే ముఖ్యమని పౌరహక్కుల ఉద్యమం భావిస్తుంది. అందువల్లనే, సమైక్య ఆంధ్రలో ఎక్కువగా అభివృద్ధి చెందిన ప్రాంతానికి కేంద్రమైన విజయవాడ నగరంలో 'ప్రాంతీయ వివక్ష' పైన ఈ సదస్సు నిర్వహిస్తున్నాం.

‘ఐక్య రాష్ట్రంలో మనం చేరడం పొరపాటయింది. ఇప్పుడయినా వేరయిపోదాం’ అనే అభిప్రాయం తెలంగాణ, రాయలసీమలలో ఎప్పుడూ ఉంది. మన ముఖ్యమంత్రి అంటున్నట్టు అది పదవులు పోగొట్టుకున్న కాంగ్రెస్ నాయకులు ఈ రోజు అకస్మాత్తుగా ముందుకు తెచ్చిన నినాదం కాదు. సామాజిక, రాజకీయ పరిస్థితులను బట్టి ఆ అభిప్రాయం ఒక్కొక్కసారి బలంగా వినిపిస్తుంది. ఒక్కొక్కసారి నివురుగప్పి ఉంటుంది. అయితే ఆ ఆలోచన ఆ ప్రాంతాలకు చెందినవారి మెదళ్ళలో లేకుండా ఎప్పుడూ పోలేదు.

రాయలసీమ, తెలంగాణకు ఒక ప్రత్యేకత ఉంది. ఈ రెండు ప్రాంతాలలోనూ ఒక ప్రత్యేక ముద్ర ఉన్న సంస్కృతి, మాటలలో ఒక ప్రత్యేక నుడికారం, ఒక ప్రత్యేక చరిత్రతో పెనవేసుకున్న ‘ఐడెంటిటీ’ ఉన్నాయి. ‘మేము’ అనే బలమైన భావన ఉంది. ఈ భావన కారణంగా, తెలుగువారంతా ఒకటిగా బ్రతకాలన్న వాదనను ఈ రెండు ప్రాంతాల మేధావులూ రాజకీయ నాయకులూ మొదటినుండి అనుమానంగా చూసారు. తెలుగుజాతి ఒకటేనన్న ఆలోచనలోని ఆదర్శాన్ని వాళ్ళు గుర్తించకపోలేదు. అయితే కృష్ణా, గోదావరి ఆనకట్టల వల్ల, బ్రిటిష్ వాళ్ళు వదిలివెళ్ళిన ఆధునికతను – ఇంగ్లీష్ భాష, పాలనా వ్యవహారాలు, పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయాలు, విద్య, సాంకేతిక నైపుణ్యం, పెట్టుబడిదారీ వర్తక సరళి – తమకంటే ముందు నుండి అలవరచుకొని ఉండడం వల్ల ఐక్య రాష్ట్రంలో కోస్తా జిల్లాలదే పైచేయి అవుతుందని వాళ్ళు సహేతుకంగా సందేహించారు. తెలుగుజాతి ఒక్కటిగా పురోగమించినప్పుడే అది ఒక్కటి అవుతుంది గానీ కేవలం ఒక రాష్ట్రంలో ఉన్నంత మాత్రాన అది ఒక్కటి కాదు. ఆ సమదృష్టి, ఐక్య పురోగతి నిజంగా ఒనగూడుతాయా అని వాళ్ళు సందేహించడంలో తప్పు లేదు.

అనుమానాలు ఉంటుండగానే తెలుగువారందరూ క్రమంగా ఒకటయ్యారు. మొదట (1953లో) కోస్తా, రాయలసీమ జిల్లాలు మద్రాసు నుండి వేరుపడగా ఆ తరువాత (1956లో) వారిరువురూ తెలంగాణవాసులతో కలిసి ‘ఆంధ్రప్రదేశ్’ అనే రాష్ట్రం ఏర్పాటు చేసుకున్నారు. ఐక్యమైతే అయ్యారుగానీ రాయలసీమ నాయకులూ, తెలంగాణ నాయకులూ తమ అనుమానాలకు బేషరతుగా సెలవు పలకలేదు. కోస్తా జిల్లాల నాయకత్వం నుండి కొన్ని నిర్దిష్టమైన హామీలు కోరారు, పొందారు.

రాయలసీమ పొందిన హామీని శ్రీబాగ్ ఒప్పందం అంటారు. 1937లోనే జరిగిన ఈ ఒప్పందంలో, ఐక్య రాష్ట్రంలో రాయలసీమ కరువు తీర్చే నీటిపారుదల ప్రాజెక్టులకు మొదటి ప్రాధాన్యం ఇస్తామని ఒప్పుకున్నారు. రాయలసీమకు నీటిలేమి ప్రధాన సమస్య కాబట్టి (రాయలసీమ సగటు వర్షపాతం కోస్తా జిల్లాల సగటు వర్షపాతంలో సరిగ్గా సగం) శ్రీబాగ్ ఒప్పందంలో రాయలసీమ నాయకులు నీటిపారుదల ప్రాజెక్టులకు ప్రాధాన్యం ఇవ్వడం సహజం.

తెలంగాణ పొందిన హామీని 'పెద్దమనుషుల ఒప్పందం' అంటారు. ఇది 1956లో తెలంగాణ నాయకులకూ అప్పటి ఆంధ్ర రాష్ట్ర నాయకులకూ మధ్య జరిగింది. తెలంగాణలో కూడా నీటి లేమి – రాయలసీమ అంతగా కాకున్నా – ఒక ముఖ్య సమస్యే. నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలకు అది రాయలసీమతో సమానమైన సమస్యే. అయితే  తెలంగాణ విద్యా, వైద్య, ఉద్యోగ రంగాలలోనూ, సాంఘిక వసతులలోనూ రాయలసీమ కంటే వెనుకబడి ఉన్నందున ఈ ఒప్పందంలో తెలంగాణ నాయకులు కేవలం సాగునీటి గురించి కాక మొత్తంగా అభివృద్ధి ప్రణాళికలలోనూ వ్యయంలోనూ సమదృష్టి ఉండాలన్న హామీ కోరారు, పొందారు.

పూర్తిగా సహేతుకమైన ఈ హామీలు ఐక్య రాష్ట్రంలో అమలు కాలేదన్న ఘోషే ఆ తరువాత ఈ రెండు ప్రాంతాలలోనూ తలెత్తిన 'ప్రాంతీయ ఉద్యమాల' చరిత్ర. ఐక్య ఆంధ్రకు ముందస్తు షరతుగా చేసుకున్న న్యాయమైన ఒప్పందాలు అమలు కాలేదనే ఆవేదన 'ప్రాంతీయతత్వం' ఎందుకవుతుందో ఆరోపించే వాళ్ళకే తెలియాలి.

సమ అభివృద్ధి, సమాన అవకాశాలు ఒక ప్రజాస్వామిక హక్కు అనే ప్రాతిపదికన ఈ ఉద్యమాల గురించి ఆలోచించాలే తప్ప ఐక్యతావాదం–వేర్పాటువాదం అనే ప్రాతిపదికన కాదని పౌరహక్కుల సంఘం భావిస్తుంది. ప్రకృతి సంపద అన్ని ప్రాంతాలోనూ సమానంగా ఉండదు. ప్రకృతిసిద్ధంగా వెనుకబడి ఉన్న ప్రాంతాలలో పెట్టుబడి ఎక్కువ పెట్టాలి. ఆ ప్రాంతాల పురోగతి కోసం రెవెన్యూ వనరులు కూడా ఎక్కువ వెచ్చించాలి. అలాగే ఆర్థిక అభివృద్ధి, విద్యా, వైద్య తదితర రంగాల అభివృద్ధి చారిత్రక కారణాల వల్ల అన్ని ప్రాంతాలలోనూ సమానంగా ఉండదు. అభివృద్ధి కుంటుపడిన ప్రాంతాల కోసం పెట్టుబడి, రెవెన్యూ వనరులు ఎక్కువ ఖర్చుచేయాలి.

అయితే 'నీరు పల్లమెరుగు' అన్నట్టు వనరులు సమృద్ధిగా ఉన్న ప్రాంతాలకే పెట్టుబడి ఎక్కువగా ప్రవహిస్తుంది. అభివృద్ధి చెందిన ప్రాంతాలనే మరింత అభివృద్ధి చేస్తుంది. అందువల్ల ప్రభుత్వం సమదృష్టితో పెట్టుబడిని నియంత్రించాలి. ప్రాంతీయ అసమానతలు తొలగిపోయే రీతిలో తన అదుపులో ఉన్న పెట్టుబడిని, రెవెన్యూ వనరులను కేటాయించాలి, ఖర్చు చేయాలి. ప్రాంతీయ అసమానతలను ప్రయత్నపూర్వకంగా పోగొట్టాలి. దీనికొక ప్రజాస్వామిక దృక్పథం ఉన్న పాలనా విధానం కావాలి. అది ఎందుకు లోపించిందో అర్థం చేసుకొని సవరించడానికి కృషి చేయడం ప్రజాస్వామికవాదుల కర్తవ్యం. అందుకోసం వివక్ష గురించి ఆందోళన చేస్తున్న వారి మాటలు ముందు వినాలి. విని ఆలోచించాలి. వారిని వేర్పాటువాదులు, విచ్ఛిన్నకారులు అనడం మానేయాలి. ఒక సమస్య న్యాయమైనదైనప్పుడు దానికి తమకు తోచిన పరిష్కారాన్ని ప్రతిపాదించే హక్కు ఆ సమస్యకు లోనయిన ప్రజలకు ఉంటుందని గుర్తించాలి. ఈ అవగాహన పెంపొందించడానికే పౌరహక్కుల సంఘం ఈ సదస్సు నిర్వహిస్తూ ఉంది.

నాలుగు దశాబ్దాల సమైక్య రాష్ట్ర అనుభవమేమిటంటే రాయలసీమలో పలు ప్రాంతాలు ఎడారి కానున్నాయి. తెలంగాణ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు ఉంది. హైదరాబాద్ నగరమూ దాని పరిసరాలూ బాగా అభివృద్ధి చెందిన మాట వాస్తవమే. కానీ ఈ అభివృద్ధి వల్ల తెలంగాణవాసులు పొందిన ప్రయోజనం స్వల్పమే. ఇతర ప్రాంతాలవాళ్ళే ఎక్కువ ప్రయోజనం పొందారు. ఆ మాట అంటే, 'హైదరాబాద్ రాష్ట్ర రాజధాని అయినప్పుడు అది ఒక ప్రాంతం వారికే ఎట్లా చెందుతుంది' అని ఇతర ప్రాంతాలవారు దబాయిస్తారు కూడా. ఆ దబాయింపు సహేతుకమైతే హైదరాబాద్ అభివృద్ధిని తెలంగాణ అభివృద్ధిగా ఎంచకూడదు. హైదరాబాద్‌ను తీసేసి చూస్తేనే తెలంగాణకు ఏమొరిగిందో అర్థం అవుతుంది. ఉత్తరాంధ్రవాసులు కూడా తమ ప్రాంతానికి కేంద్ర పట్టణమైన విశాఖపట్నం గురించి ఇదే మాట అనగలరేమో!

ప్రాంతీయ వెనుకబాటుతనం గురించి మాట్లాడడం అభివృద్ధి చెందిన ప్రాంతాలపైన ద్వేషం రెచ్చగొట్టడానికా అని అడుగుతారేమో. ఎవరూ ఎవరినీ ద్వేషించనవసరం లేదు. ద్వేషించమని చెప్పడం పౌరహక్కుల సంఘం ఉద్దేశం కాదు. కానీ ద్వేషానికి

కారణమైన పరిస్థితులను గుర్తించి సవరించే ప్రయత్నం అందరూ చేయకపోతే ద్వేషాలు – ఎంత అవాంఛనీయం అయినా – సమసిపోవు. అన్యాయం ఎక్కడున్నా దానిని అందరూ ద్వేషించడం నేర్చుకుంటేనే మనిషిని మనిషి ద్వేషించే పరిస్థితి రాదు. అందువల్ల వివక్షకు గురైన ప్రాంతాల సమస్యల పట్ల ఇతర ప్రాంతాలలో సదవగాహన పెంపొందించడం కోసమే విజయవాడలో ఈ సదస్సు నిర్వహిస్తున్నాము.

*ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కరపత్రంగా వచ్చింది.*

*16 ఆగస్టు 1997*

# తెలంగాణ ఉద్యమం హక్కుల పరిరక్షణలో భాగమే

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయాలన్న ఉద్యమం మరోసారి బలంగా ముందు కొచ్చింది. గతంలో మాదిరిగానే పదవులు దక్కని రాజకీయ నాయకుల కుట్ర ఫలితమే వేర్పాటువాదమన్న ఆరోపణలు, నిందలు ఈసారి కూడా వినబడుతున్నాయి. ఈ నిందారోపణలు ఉద్యమాలు తలెత్తడానికి గల కారణాలను బయటకు తేలేవు కాబట్టి వాటిని పక్కకుబెట్టి తెలంగాణ రాష్ట్రం డిమాండ్ తలెత్తడానికున్న సామాజిక – ఆర్థిక కారణాలను తెలుసుకుంటే తెలంగాణ సమస్యలకు ప్రజాస్వామ్య పరిష్కారాలను వెతికే అవకాశం కలుగుతుంది.

తెలంగాణ కేవలం ఒక భౌగోళిక ప్రాంతం కాదనీ ప్రత్యేక అస్తిత్వం, ప్రతిపత్తి కలిగిన సమాజమనీ తెలంగాణ ఉద్యమకారులు చేస్తున్న వాదన వెనుక కొన్ని చారిత్రక వాస్తవాలున్నాయి. ఉద్యోగాలు ఉత్తర హిందుస్థానం నుండి వచ్చిన వారికి కాక స్థానికులకు కల్పించాలన్న డిమాండ్‌తో 1890లలో తలెత్తిన ముల్కీ ఉద్యమం తెలంగాణ ప్రతిపత్తిని కాపాడుకోవాలన్న ఆకాంక్షకు ఊపిరిపోసింది. ఈ ప్రతిపత్తి చారిత్రక క్రమంలో పెంపొందింది.

ముల్కీ ఉద్యమం కేవలం ఉద్యోగాల కొరకు వచ్చింది కాదు. లక్నో నుండి వచ్చిన వారు ఇక్కడి ఉర్దూభాష పట్ల, సంస్కృతి పట్ల వ్యక్తం చేసిన ఈసడింపులకు వ్యతిరేకంగా కూడా వచ్చింది. ముల్కీ నిబంధనల అమలు కొరకు కూడా ఉద్యమాలు సాగాయి. ఆ తర్వాత నిజాం నిరంకుశ పాలనలో తెలుగు భాష, సంస్కృతిని కాపాడుకోవడానికి తెలంగాణ ఆంధ్ర జనసంఘం, తెలంగాణ ఆంధ్ర మహాసభలు చేసిన కృషి వలన తెలంగాణ ఉనికిని నిలబెట్టుకోవాలన్న ఆలోచన బలపడింది.

పై చారిత్రక పరిస్థితుల వలన, ఉమ్మడి రాష్ట్రం ఏర్పాటు తెలంగాణ ఆకాంక్షలకు ఆటంకమౌతుందనే భావన స్వాతంత్రం తరువాత బలంగానే వ్యక్తమైంది. ఫజల్ అలీ కమిషన్ (రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ కమిషన్) కూడా తెలంగాణను ఆంధ్రతో విలీనం చేయడానికి ఒప్పుకోలేదు. 1960 దాకా ఆంధ్ర, తెలంగాణలు విడిగా వుండాలని, ఆ తర్వాత తెలంగాణ శాసనసభలో 2/3 వ వంతు సభ్యులు అంగీకరిస్తేనే తెలంగాణ, ఆంధ్రల విలీనం జరగాలని ఫజల్ అలీ కమిషన్ సూచించింది. నాటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ కూడా ఉమ్మడి రాష్ట్రం ఏర్పాటును వ్యతిరేకించాడు.

అయినా రెండు ప్రాంతాలకు చెందిన పెద్దమనుషులు ఢిల్లీలో కూర్చొని విస్తృతమైన సంప్రదింపులు జరపకుండానే ఒక ఒప్పందం ద్వారా ఉమ్మడి రాష్ట్రాన్ని ఏర్పాటుచేయాలని నిర్ణయించారు. ఈ ఒప్పందం ప్రకారం తెలంగాణకు కోస్తా ఆంధ్ర నాయకులు దిగువ హామీలిచ్చారు.

1. తెలంగాణ ఉద్యోగాలను స్థానికులకు రిజర్వ్ చేసే ముల్కీ నిబంధనలు యథావిధిగా కొనసాగుతాయి.

2. తెలంగాణ విద్య, వైద్య అభివృద్ధికి, ప్రణాళిక రూపకల్పనకు, భూసంబంధాల నియంత్రణకు, విద్యాసంస్థల్లో అడ్మిషన్లను నిర్ధారించే నియమాల రూపకల్పనకు తెలంగాణ శాసనసభ్యులతో కూడిన రీజనల్ కమిటీ ఉంటుంది. కేటాయించబడిన అంశాలపై కమిటీ నిర్ణయాలనే ప్రభుత్వం అమలుచేస్తుంది.

3. ఉమ్మడి యంత్రాంగం నిర్వహణకయ్యే ఖర్చులో మూడింట ఒకవంతు తెలంగాణ భరించాలి. ఆ మొత్తం పోను తెలంగాణ నుండి వచ్చే రెవెన్యూలో

మిగులును పూర్తిగా తెలంగాణ అభివృద్ధికే కేటాయించాలి. ఆ రోజుల్లో ఆంధ్రకన్నా తెలంగాణకే రెవెన్యూ ఎక్కువ కనుక ఈ నియమాన్ని రూపొందించారు.

4. ఆంధ్ర నుండి ముఖ్యమంత్రి ఉంటే తెలంగాణకు చెందిన వ్యక్తిని ఉపముఖ్యమంత్రిగా నియమిస్తారు. ఒకవేళ తెలంగాణ ప్రాంతానికి చెందిన వ్యక్తి ముఖ్యమంత్రి అయితే ఆంధ్రకు చెందిన వ్యక్తి ఉపముఖ్యమంత్రిగా ఉంటాడు.

ఇన్ని షరతులకు ఒప్పుకుని తెలంగాణను చేర్చుకోడానికి నాటి కోస్తా ఆంధ్ర నాయకులు ఎందుకు కృషి చేసినట్టు?

ఎందుకంటే తెలంగాణ, ఆంధ్రలు విలీనమైతే తప్ప కోస్తా ఆంధ్ర ప్రాంతం నదీజలాలను పొందలేదు. తెలంగాణ ఆంధ్రలో విలీనమైతేనే ఆంధ్రకు కావలసిన ప్రాజెక్టులను అమలుచేయడం సాధ్యమవుతుందని ఫజల్ అలీ కమిషన్ ముందు అప్పటి నాయకులు పేర్కొన్నారు కూడా. తెలంగాణలోని జలవనరులే కాక ఖనిజ సంపద కూడా ఉమ్మడి రాష్ట్ర అభివృద్ధికి తోడ్పడుతుందని భావించారు.

కాని – ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత తెలంగాణకు ఇచ్చిన ఏ ఒక్క హామీ కూడా అమలుకాలేదు. హామీలన్నీ నీటిమూటలయ్యాయి. ఉమ్మడి రాష్ట్రంలో ఇప్పటివరకు తెలంగాణ వ్యక్తులు ముఖ్యమంత్రిగా వున్న కాలం మొత్తం కలిపినా ఐదు సంవత్సరాలు దాటదు. తెలంగాణేతరులే సుమారు 30 సంవత్సరాలు పాలన చేశారు. ఈ కాలంలో తెలంగాణకు చెందిన వ్యక్తికి ఒకటి రెండుసార్లు తప్ప ఎప్పుడూ ఉపముఖ్యమంత్రి పదవి దక్కలేదు.

అలాగే విధానాల రూపకల్పనలో రీజనల్ కమిటీని ఎప్పుడూ సంప్రదించలేదు. చివరికి 1970లలో రీజనల్ కమిటీని పూర్తిగా రద్దు చేశారు. ముల్కీ నిబంధనలు ఆది నుంచీ సక్రమంగా అమలుకాలేదు. వాటిని రద్దు చేయాలని కోర్టుల్లో కేసులు నడిచాయి. చివరికి 1971లో సుప్రీంకోర్టు ముల్కీ నిబంధనలు చెల్లుతాయన్నది. అప్పుడు వాటిని రద్దు చేయాలని కోస్తాలో ఆందోళన సాగింది. ఫలితంగా ముల్కీ నిబంధనలు రద్దయి వాటి స్థానంలో ఆరుసూత్రాల పథకం అమలులోకి వచ్చింది.

ముల్కీ నిబంధనల ప్రకారం 12 సంవత్సరాలు నివాసముంటేనే తెలంగాణలో ఉద్యోగాలకు అర్హత వచ్చేది. ఆరు సూత్రాల ప్రకారమైతే నాలుగేళ్ళు జోన్‌లో నివాసముంటే చాలు ఉద్యోగం పొందవచ్చు. ఈ అర్హత పొందడం చాలా సులువు. 1975లో ఆరు సూత్రాల పథకం అమలులోకి వచ్చినప్పటినుండి 1985 దాకా తెలంగాణలో 58 వేల మంది ప్రాంతేతరులకు ఉద్యోగాలు ఇచ్చారని 610 జీవోలో ప్రభుత్వమే అంగీకరించింది.

పెద్దమనుషుల ఒప్పందం ఉల్లంఘన ఫలితంగానే తెలంగాణపై కోస్తా ఆంధ్రలోని అభివృద్ధి చెందిన జిల్లాల ఆధిపత్యం స్థిరపడిపోయింది. తెలంగాణ హక్కులు దెబ్బతిన్నాయి. అప్పటికే ప్రచార సాధనాల మీద నెలకొని ఉన్న ఆధిపత్యం వలన, సంపద వలన కోస్తా ఆంధ్ర సంపన్నవర్గానికి, మేధావి వర్గానికి రాష్ట్రంలోని విభిన్న సంస్థలపై అజమాయిషీ లభించింది. ఇటు సమాజంలోను, అటు రాజకీయ వ్యవస్థలోను సంక్రమించిన అధికారం కారణంగా బొగ్గు, కలప, నదీజలాలు మొదలయిన వనరులలో అతిపెద్ద వాటా కోస్తా జిల్లాలదే అయింది.

తెలంగాణ అభివృద్ధికి నిజాం ప్రతిపాదించిన దేవునూరు, తుంగభద్ర, భీమా, ఇచ్ఛంపల్లి ప్రాజెక్టులు పక్కకు పోయాయి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం ప్రకారం భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు నాటికి ప్రతిపాదించబడిన ప్రాజెక్టులు పూర్తయ్యాకే ఇతర ప్రాజెక్టులను చేపట్టాలి. ఈ నియమం తెలంగాణలో మాత్రం ఉల్లంఘించబడింది.

నిజాం ప్రతిపాదించిన ప్రాజెక్టులలో నందికొండ ఒక్కటే పూర్తయింది. అది కూడా నాగార్జునసాగర్ ప్రాజెక్టుగా అమలైంది. సవరించబడిన సాగర్ కూడా గుంటూరు, ప్రకాశం జిల్లాలకే ఎక్కువ నీళ్ళందించింది. తెలంగాణకు రావలసిన 180 టి.ఎం.సి.లలో 65 టి.ఎం.సి.ల నీరు కూడా సరిగ్గా రాలేదు. కనీసం ఫ్లోరోసిస్ ప్రాంతాలకు తాగునీరు అందించే ప్రయత్నం కూడా జరగలేదు.

ఇక దేవునూరు బదులు మంజీరాపై సింగూరు వద్ద హైదరాబాదుకు నీరందించే పథకం అమలైంది. భారీ ప్రాజెక్టులను నిర్మించకపోగా రాష్ట్ర వ్యాపితంగా చెరువుల వ్యవస్థను తీవ్రంగా ఉపేక్షించడం తెలంగాణకు చాలా నష్టం చేసింది.

దాంతో గత నలభై సంవత్సరాలలో తెలంగాణలో చెరువుల కింద సాగవుతున్న భూమి 12 లక్షల ఎకరాల నుండి 5 లక్షల ఎకరాలకు పడిపోయింది. ఫలితంగా నీటిపారుదలకు బావులు మాత్రమే ఏకైక ఆధారంగా మిగిలాయి. భూగర్భ జలాలు అడుగంటడంతో బావులూ ఎండిపోయాయి. స్థిరమైన సాగునీటి వసతిని కల్పించలేకపోవడం వలన తెలంగాణ వ్యవసాయం పూర్తిగా చితికిపోయింది. వ్యవసాయం నుండి బతుకుతెరువు లేక రైతులు సయితం అసంఘటిత రంగంలో కూలీలయ్యారు. ఇంకా వ్యవసాయం మీద ఆధారపడిన వారు అప్పుతెచ్చి వాణిజ్య పంటలను పండించి తగిన ప్రతిఫలం లభించక, అప్పు తీరక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. పోనీ సాంప్రదాయక పంటలు పండిద్దామన్నా వాటి నుండీ బతుకుతెరువు లేదు.

కృష్ణానది అత్యధికంగా ప్రవహించేది మహబూబ్‌నగర్ జిల్లాలోనే అయినప్పటికీ ఆ నదివల్ల అతితక్కువ ప్రయోజనం పొందింది ఆ జిల్లాయే. అసలే వర్షపాతం చాలా తక్కువగా ఉన్న మహబూబ్‌నగర్ తన నడిబొడ్డున ప్రవహించే కృష్ణానదిని చూస్తూ ఎడారిగా మారుతున్నది.

మరోవైపు నీటివసతి కలగడం వల్ల కోస్తా ఆంధ్రలోని సాగునీరున్న జిల్లాల్లో హరితవిప్లవం వచ్చింది. వ్యవసాయంలో మిగులు పెరిగింది. ఈ మిగులు వలన వ్యవసాయాధారిత పరిశ్రమల ఏర్పాటుకు, వ్యాపారానికి అవకాశాలు ఏర్పడ్డాయి. ఇక్కడ గమనించవలసిన విషయమేమిటంటే ఉమ్మడి రాష్ట్రం ఏర్పడినప్పటి నుండి ప్రభుత్వ రెవెన్యూలో 50 నుండి 75 శాతం వరకు నీటిపారుదల, విద్యుత్ రంగాలకే కేటాయించగా వాటి ఫలితాలు కోస్తాకే దక్కాయి. ప్రభుత్వ అండదండల వలన కాళోజీ అన్నట్టు 'రెండున్నర జిల్లాల్లోని రెండున్నర శాతం' మంది ఆంధ్రప్రదేశ్ సామాజిక, రాజకీయ జీవితాన్ని శాసించగల శక్తిని పొందారు.

ఈ పరిణామాల పర్యవసానమే చంద్రబాబు ప్రతిపాదించిన విజన్ 2020 ప్రణాళిక. ఈ ప్రణాళికలో తెలంగాణ ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలకు స్థానమే లేదు. తెలంగాణకు సాగునీటిని కల్పించడానికి, వ్యవసాయాన్ని పెంపొందించడానికి పథకాలేవీ లేవు. కానీ ప్రభుత్వ పెట్టుబడుల ద్వారా విజయవాడ నుండి విశాఖపట్నం దాకా రోడ్లు, నౌకారేవులు, గ్యాస్ కంపెనీలు ఏర్పడుతున్నాయి. ఈ మౌలిక

సదుపాయాల కల్పన వలన ప్రైవేటు పెట్టుబడులు వచ్చి విజయవాడ – కాకినాడ – విశాఖపట్నం ఒక 'అభివృద్ధి త్రికోణం'గా వర్ధిల్లబోతోంది. అంటే ప్రైవేట్ పెట్టుబడులతో వచ్చే ఆర్థికాభివృద్ధికి తెలంగాణ చవకైన ముడిసరుకును అందిస్తూ కోస్తా ఆంధ్ర సంపన్న వర్గాల ఆధిపత్యంలో ఎదిగే ఆర్థిక వ్యవస్థ అంచులలో మిగిలిపోతున్నది.

అభివృద్ధిని సమానంగా పొందే హక్కు ఒక ప్రజాస్వామిక హక్కు. వనరులున్నచోట ఆ వనరులను ఉపయోగించి, లేనిచోటికి వాటిని తరలించి, ఆయా ప్రాంతాలు ఏ విషయంలో వెనుకబడి ఉన్నాయో ఆ విషయాలపైన ప్రత్యేక దృష్టి పెట్టి, అన్ని ప్రాంతాలూ ఒకదాని సరసన ఒకటి నడిచేటట్టు అన్నిటినీ అభివృద్ధి చేసినప్పుడే 'మనమందరమూ ఒకటే'ననే భావన ఒక పెత్తందారీ భావన కాక ప్రజాస్వామిక భావన అవుతుంది. అటువంటి ప్రజాస్వామిక సమైక్యతకు తోడ్పడి ఉండగల 'పెద్దమనుషుల ఒప్పందం' సంపూర్ణంగా ఉల్లంఘించడం వలన సమైక్యత పేరిట తెలంగాణ తీవ్రమైన వివక్షకు గురయింది.

ఈ పరిస్థితిలో నీళ్ళను పొందడానికి, వ్యవసాయాన్ని పెంపొందించుకోవడానికి, ఉద్యోగాలను సాధించుకోవడానికి, బతకడానికి, బతుకుదెరువు పొందడానికి – తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఏకైక మార్గమన్న అభిప్రాయం క్రమేపీ బలపడింది. భారతదేశంలోని వివిధ రాష్ట్రాలలోని విభిన్న ప్రాంతాలలో కొన్నింటికి మాత్రమే తమ ప్రయోజనాలు కాపాడుకోవడానికి రాజ్యాంగంలోను, చట్టాలలోను ప్రత్యేకమైన హక్కులు కల్పించబడ్డాయి. ఇది ఆ ప్రాంతవాసులు తమ ఉనికినీ అభివృద్ధినీ కాపాడుకోవడానికి చేసిన ప్రయత్నాల ఫలితం. తెలంగాణ అటువంటి కొన్ని ప్రాంతాలలో ఒకటి. అయితే ఆ హక్కులు ఆచరణలో సరయిన అమలుకు నోచుకోలేదు. ఆ హక్కుల ఉల్లంఘన వల్లనే తెలంగాణ వివక్షకు లోనవుతున్నది కనుక హక్కుల ఉల్లంఘనే తెలంగాణ వాదానికి మూలకారణం.

సహజ వనరులపైన, అభివృద్ధి క్రమంపైన ఆధిపత్యం సంపాదించుకున్న ప్రాంతాలు ప్రపంచం అంతటా ఇతర ప్రాంతాలపైన రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా అజమాయిషీ చేస్తున్నాయి. ఆ క్రమంలో వెనుక ఉంచబడ్డ ప్రాంతాల ప్రజల జీవన విధానం, సంస్కృతి, ఆచార వ్యవహారాలు, భాష చిన్నచూపుకు గురవుతున్నాయి.

వెనుకబాటుతనం వల్ల ఆ ప్రాంత ప్రజలు జీవితంలోని అన్ని రంగాలలోనూ తమకున్న హక్కులను అనుభవించలేకపోతున్నారు. తమ అస్తిత్వం, ఉనికి ప్రశ్నార్థకంగా మారినప్పుడు ఆ ఉనికిని కాపాడుకుని, అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే కాంక్ష ఉద్యమరూపంలో బయటపడుతుంది. ఇప్పుడు ముందుకొచ్చిన తెలంగాణ ఉద్యమాన్ని కూడా, హక్కులు కోల్పోయిన నేపథ్యంలో హక్కుల సాధన కోసం ముందుకొస్తున్న ప్రజల తపన, ఆకాంక్షలుగానే మానవహక్కుల వేదిక చూస్తుంది. ఇతర ప్రాంతాల ప్రజలు కూడా ఆ విధంగానే చూడాలని కోరుకుంటుంది.

*మానవహక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది.*

*1 జూలై 2001*

# తెలంగాణ ఉద్యమానికి నిర్దిష్టమైన కార్యక్రమాలు అవసరం

నిర్దిష్టమయిన కార్యక్రమమేదీ లేకుండా తెలంగాణ రాష్ట్ర సమితి ప్రత్యేక తెలంగాణకు సంపాదించగల మద్దతంతా సంపాదించేసిందనే భావించవలసి ఉంటుంది. ఇక మీదట సంపాదించాలంటే మాత్రం నిర్దిష్టమైన కార్యక్రమాలు కావాలి.

దానికి చంద్రశేఖర్‌రావు ఎంత సిద్ధంగా ఉన్నారో తెలీదు. మన దేశంలో సగటు రాజకీయవేత్తలు సమస్యల మీద కార్యక్రమాలు చేపట్టడం మరచిపోయి కొన్ని దశాబ్దాలయింది. అయితే తెలంగాణ ఉద్యమమంటే తెలంగాణ రాష్ట్ర సమితే కాదు కాబట్టి సమస్యల మీద చేపట్టగల కార్యక్రమాల గురించి కొంచెం చర్చ అవసరం. ఈ చర్చ తెలంగాణ రాష్ట్ర సమితికి ఒక కార్యక్రమాన్ని అందియ్యగలిగితే మరీ మంచిది.

ఎందుకంటే తెలంగాణ గురించి కూలంకషంగా అధ్యయనం చేసి లోతుగా విశ్లేషించి చెప్పగల నాయకులు, ఉద్యమాలూ చేయలేని పని రాజకీయ 'ప్రధాన స్రవంతి'కి చెందిన చంద్రశేఖర్‌రావు చేశారు. ఒక ఊపు తీసుకొచ్చారు. అది ఎందుకో చెప్పగల విశ్లేషణ పరికరాలు మన దగ్గర లేవు. హేతుబద్ధమైన జ్ఞానం మీద ఆధారపడిన ఆచరణే ఫలితాన్ని ఇస్తుందని, అది ఎంత హేతుబద్ధమయితే అంత మంచి ఫలితాన్ని

ఇస్తుందని నమ్మడమే మనకు తెలుసు. 'శాస్త్రీయత' మీద ఉన్న ఈ విశ్వాసం విషయంలో మార్క్సిస్టులకూ బూర్జువా హేతువాదులకూ తేడా లేదు. అది అన్ని వేళలా నిజం కానక్కరలేదని ఋజువు చేసే సంఘటనలు మళ్ళీ మళ్ళీ జరుగుతూనే ఉంటాయి. అయినప్పటికీ ఈ విశ్వాసం చెక్కు చెదరకపోవడానికి కారణం విశ్వాసాలకుండే బలమే తప్ప ఈ విశ్వాసంలోని సత్యం కాదు.

కాబట్టి టి.ఆర్.ఎస్.ను తక్కువ చేయకుండానే నిర్దిష్టమైన కార్యక్రమాల ఆవశ్యకత గురించి మాట్లాడుకుందాం. వనరులుండీ వాటివల్ల ప్రయోజనం పొందలేకపోవడం తెలంగాణ పరిస్థితిని వివరించే క్లుప్తమయిన వ్యాఖ్య అనుకున్నట్లయితే ఏ వనరులను ఏ విధంగా ఉపయోగించడం సాధ్యమయ్యేదో, అది ఉమ్మడి రాష్ట్రంలో ఎందుకు సాధ్యం కాలేదో వివరించడం, దాని సాధన కోసం ఆందోళన చేపట్టడం ద్వారా ఈ రాష్ట్రం 'ఉమ్మడి' స్వభావాన్ని సవాలు చేయడం ఒక నిర్దిష్టమైన కార్యక్రమం అవుతుంది.

దీనికి చాలా అధ్యయనం కావాలి. నిరంతరాయంగా కరెంటు సరఫరా – అది కూడా పెద్ద మోతాదులో ఉంటే తప్ప నడవని ప్రాజెక్టుకు గోదావరి మీద శంకుస్థాపన చేయడం ద్వారా చంద్రబాబునాయుడు ఒక పెద్ద ప్రశ్నను తెలంగాణ అభిమానుల ముందు నిలబెట్టారు. అటువంటివి తప్ప వేరే రకమైన ప్రాజెక్టులు గోదావరి మీద సాధ్యమా? అటువంటివి మాత్రమే సాధ్యమనుకుంటే కరెంటు సబ్సిడీని ఎట్టి పరిస్థితిలోనూ ఆమోదించని ప్రపంచ బ్యాంకు పాలనలో గోదావరి నీటిని తెలంగాణ కోసం వినియోగించడం సాధ్యమా? వేరే రకమైన ప్రాజెక్టులు – ఉదాహరణకు నది మీద కాక ఉపనదుల మీద, వాగుల మీద కట్టుకునేటట్టయితే రాష్ట్రానికి బచావత్ అవార్డు కేటాయించిన 1480 టి.ఎం.సి.ల గోదావరి నీటిలో చాలా భాగం వాడుకోలేకనే పోవచ్చు. అందులోనూ తెలంగాణలో అసలే వాడుకోలేకపోవచ్చు. గోదావరికి దూరాన ఉన్న జనగామ డివిజన్ వంటి దుర్భిక్ష ప్రాంతాలకు నీరు ఇవ్వలేకపోవచ్చు. అప్పుడేం చేయాలి? దీనికి సులభమైన జవాబు ఉందని నేను అనుకోవడం లేదు. అయితే ఒకటి మాత్రం నిజం. తెలంగాణకు నీళ్ళిచ్చే జవాబు – అది ఏదయినప్పటికీ – అమలు కావాలంటే ఆర్థిక వనరుల కేటాయింపులకు, సాగునీటికి ఉచిత ప్రాముఖ్యం ఇయ్యవలసి ఉంటుంది. ప్రస్తుత రాష్ట్ర పాలకులు అందుకు సిద్ధం కారు కాబట్టే వారి వ్యవసాయ విధానపత్రంలోనూ 'విజన్'లోనూ ఈ

ప్రశ్ననే తొలగించి వేశారు. నీళ్ళెట్లా ఇవ్వాలి అన్న ప్రశ్నను తొలగించి నీళ్ళు – వర్షం నీళ్ళు తప్ప – అక్కరలేని వ్యవసాయాన్ని అంతర్జాతీయ మార్కెట్‌తో ముడిపెట్టడం ఎట్లా అన్న చర్చ చేపట్టారు.

ఆ 'పరిష్కారం' వ్యవసాయదారులను సంక్షోభంలో పడేసే పరిష్కారం కాబట్టి దానిని తిరస్కరించాలి. వీలయిన మేరకు వ్యవసాయానికి సాగునీరు అందించడం ద్వారా వ్యవసాయదారులకు కనీస భద్రత కల్పించడం అవసరం అని గుర్తించాలి. దానికి గల మార్గాలను గోదావరి బేసిన్‌కు సంబంధించి అన్వేషించి, అందుకయ్యే ఖర్చును స్వీకరించడానికి సిద్ధం కమ్మనీ కాకపోతే ఎందుకు కారో చెప్పమనీ రాష్ట్ర ప్రభుత్వాన్ని సవాలు చేయాలి. ఈ సవాలు ప్రజల చైతన్యంలో భాగం కావాలి.

కృష్ణా బేసిన్ విషయం కొంత స్పష్టమైనదే కానీ అది సహితం స్పష్టంగా వ్యక్తం కావడం లేదు. గోదావరిలో పుష్కలంగా ఉన్న నీటిని ఏ విధంగా వాడుకోవాలన్నది ఉత్తర తెలంగాణ సమస్య కాగా, కృష్ణ మీద ఉన్న ఆశలకు తగినంత నీళ్ళు ఆ నదిలో లేవు కదా, మరి ఏం చేయాలన్నది దక్షిణ తెలంగాణ సమస్య.

దానికి ఒకటే జవాబు ఉంది. కోస్తా జిల్లాల వాడకాన్ని తగ్గించి దక్షిణ తెలంగాణకూ, రాయలసీమకూ ఇవ్వాలి. ఉమ్మడి రాష్ట్రంలో దీనికి రాజకీయ మార్గమే తప్ప రాజ్యాంగ సంబంధమైన మార్గం లేదు. ఆ రాజకీయ మార్గం ఆచరణ సాధ్యం కాదని ఇన్నేళ్ళ ఉమ్మడి రాష్ట్ర చరిత్ర చెప్తున్నది. నది దిగువన ఉన్న కోస్తా జిల్లాల వాసులు ఉమ్మడి రాష్ట్రాన్ని కాపాడుకోవడం కోసమయినా సరే ఒక్క చుక్క నీరు కూడా వదులుకోరని స్పష్టంగానే ఉంది. లేకపోతే పులిచింతల మాకొద్దని ఒక్క కోస్తా జిల్లా నాయకుడయినా అని ఉండేవాడు.

రాష్ట్రాలు వేరయితే రాజ్యాంగమే మార్గం చూపిస్తుంది. అంతర్ రాష్ట్ర నదుల గురించి పరీవాహక రాష్ట్రాలు వివాదం లేవదీయవచ్చునని రాజ్యాంగం గుర్తిస్తుంది. ఆ వివాదం పరిష్కారానికి ఒక యంత్రాంగాన్ని రూపొందించే అవకాశం పార్లమెంటుకు కల్పించింది. వేరుపడితే రాజ్యాంగం కల్పించే ఈ పరిష్కారాన్ని ఉమ్మడి రాష్ట్రంలో స్నేహపూరిత రాజకీయం ఇవ్వగలదా అన్న ప్రశ్నకు జవాబు ఇప్పటికయితే స్పష్టంగానే ఉంది. వేరే రకంగా ఉండగలదని చెప్పదలచుకున్నవారు దానిని 'రుజువు

చేసే బాధ్యత' తమ మీద వేసుకోక తప్పదు. ఈ సవాలు తెలంగాణ ఉద్యమ చైతన్యంలోనూ, వ్యక్తీకరణలోనూ భాగం కావాలి.

అయితే రాష్ట్రం వేరయినప్పటికీ ఇక్కడొక ఆచరణాత్మకమైన సమస్య ఉంది. అంతర్ రాష్ట్ర నదీ వివాదాలలో ఒక రాష్ట్రానికి హక్కు కల్పించడం కోసం మరొక రాష్ట్రంలో ఇప్పటికే ఉన్న నీటివాడకాన్ని తగ్గించి అక్కడ రైతులు పంట మార్పిడి చేసుకోవాలని శాసించిన నదీ జలాల ట్రిబ్యునల్ అవార్డు ఏదీ లేదు. కానీ ఆ ఒరవడి మారకపోతే రాష్ట్రం వేరయినా మిగులు జలాలు తప్ప తెలంగాణకు వేరే ఏమీ దక్కదు. అందువల్ల కృష్ణా నదీజాలాల పంపిణీ విషయంలో బచావత్ ట్రిబ్యునల్ అనుసరించిన పద్ధతినే ప్రశ్నించి అందుకు భిన్నమైన ప్రమాణాలను నెలకొల్పడం అవసరం. అందుకోసం ఇతర దేశాలలో నదీజలాల పంపిణీ విషయంలో అనుసరించిన ప్రమాణాలను అధ్యయనం చేయడం అవసరం.

అదట్లాగుంచి, ఒకే రాష్ట్రంలో అందరూ ఉండాలని కోరుకునేటట్టయితే కోస్తా జిల్లాల వ్యవసాయదారులు పంట మార్పిడి చేసుకొని కృష్ణా నీటి వాడకాన్ని ఎంత లేదన్నా సగానికి తగ్గించుకోక తప్పదన్న వాదనను చర్చకు పెట్టినప్పుడే ఉమ్మడి రాష్ట్రం అన్న భావన ఎంత సమస్యాత్మకమైనదో అర్థమవుతుంది. తెలంగాణ వేరుపడాలన్న డిమాండు కేవలం 'ఎమోషనల్' ఆరాటం కాదనీ నిరుద్యోగ రాజకీయ నాయకుల వ్యాపకం అసలే కాదనీ పూర్తిగా హేతుబద్ధమైనదనీ అర్థం అవుతుంది.

నదీ జలాలు ఒక వనరు మాత్రమే. చెరువుల వ్యవస్థ, భూగర్భ జలాలు, వాటి వాడకానికి అవసరమయ్యే కరెంటు బావులు, కరెంటుకు ముడిసరుకుగా ఉపయోగపడగల సింగరేణి బొగ్గు, ఆ బొగ్గు గనుల నిర్వహణ, ఆ బొగ్గు వినియోగంలో ప్రాధాన్యతలు, బొగ్గు ధర, కరెంటు ధర ఇటువంటి అనేక విషయాల గురించి నిర్దిష్టమైన అధ్యయనం, చర్చ, కార్యక్రమాలు అవసరం. వాటిని ప్రజలలోకి తీసుకొనిపోవడం అవసరం.

*ప్రజాతంత్ర వారపత్రిక*

*19 ఆగస్టు 2001*

# తెలంగాణ – సమాజం – పత్రికారంగ చరిత్ర

తెలంగాణ పత్రికారంగం చరిత్ర నిర్ధారణకే కాక, పత్రికారంగానికీ ఇతర సామాజిక రాజకీయ రంగాలకూ గల సంబంధ బాంధవ్యాల విశ్లేషణకు కూడా ముడిసరుకును అందియ్యగల పుస్తకం 'షబ్నవీస్'. ఈ రోజు జర్నలిజం యజమానులకు వ్యాపారమూ, ఉద్యోగులకు వృత్తీ అయిపోయింది గానీ తొలినాడు అది దేశమంతటా సామాజిక రాజకీయ కృషితోనూ, ఉద్యమాలతోనూ ముడిపడి ఉండింది. తెలంగాణ అందుకు మినహాయింపు కాదు. తెలంగాణకు తన గమ్యాన్నీ, గతినీ నిర్ణయించుకునే అవకాశాన్ని కల్పించడం కోసం ఈ రోజు విస్తృత స్థాయిలో జరుగుతున్న కృషిలో భాగంగా తెలంగాణ పత్రికా రంగం ఆవిర్భావాన్నీ, ఎదుగుదలనూ దానికి ఇతర సామాజిక కృషితో గల సంబంధాన్నీ రికార్డు చేసే ప్రయత్నం సంగిశెట్టి శ్రీనివాస్ చేశారు. 19వ శతాబ్దం చివరి భాగంలో సాలార్‌జంగ్ సంస్కరణలలో భాగంగా హైదరాబాద్ ప్రభుత్వం చొరవతో రైతులకోసం ప్రారంభించిన 'శేద్య చంద్రిక'తో మొదలుపెట్టి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ దాకా తెలంగాణ నుంచి ప్రచురితమైన పత్రికలన్నింటి గురించీ తనకు అందిన సమాచారం రచయిత ఈ పుస్తకంలో ఇచ్చారు.

ఇది 'ముడిసరుకు' మాత్రమేనంటే రచయిత నొచ్చుకోరని ఆశిస్తాను. చరిత్ర రచనలో ముడి విషయాల సేకరణా అవసరమే. ఒక్కొక్కసారి అదే విశ్లేషణ

కంటే కష్టతరమైన పని. అయితే శ్రీనివాస్ దానికి అక్కడక్కడ కొంత విశ్లేషణ కూడా జతచేశారు. 'బ్రిటిషాంధ్రలో మొదట మత ప్రచారానికై తెలుగు పత్రికలు వెలువడగా ఇందుకు విరుద్ధంగా తెలంగాణ నుండి ప్రథమంగా రైతులకు ఉపయోగమైన వ్యవసాయ పత్రిక వెలువడింది' అని 1886లో ప్రచురణను ఆరంభించిన 'శేద్య చంద్రిక'ను ప్రస్తావిస్తూ శ్రీనివాస్ అన్నారు. 'ఈ తేడాను గమనిస్తే ఆనాటి ఈ రెండు ప్రాంతాల మధ్య గల రాజకీయ, ఆర్థిక, సామాజిక స్థితిగతులు తెలుస్తాయి' అని కూడా అన్నారు. ఆ ఒక్క తేడా నుండి ఇన్ని విషయాలు తెలిసే అవకాశం లేకున్నప్పటికీ తెలంగాణ పత్రికారంగం ఎదుగుదల ఈ ప్రాంతపు రాజకీయ, ఆర్థిక, సామాజిక స్థితిగతులలో వచ్చిన ఇతర మార్పులతో పెనవేసుకొని నడిచిన వైనం ఈ పుస్తకంలో పొందుపరచిన సమాచారంలో స్పష్టంగానే గోచరిస్తుంది.

పత్రికారంగం ఎదుగుదలకు విద్యావ్యాప్తి, రాజకీయ చైతన్యం ఒక తప్పనిసరి సందర్భం కాగా, కలవారి పోషణ కూడా (ముఖ్యంగా తొలిదశలో) అవసరమే. మొదటి కారణంగా వరంగల్, రెండవ కారణం వల్ల మహబూబ్‌నగర్ తెలంగాణ పత్రికారంగం చరిత్రలో ఇతర జిల్లాల కంటే ప్రముఖ పాత్ర వహించాయి. వరంగల్ ఆనాడూ ఈనాడూ కూడా విద్యా సంబంధమైన విషయాలలో తెలంగాణలో అగ్రభాగాన ఉంది. కాగా, మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన వనపర్తి, గద్వాల, కొల్లాపురం, అమరచింత మొదలైన సంస్థానాధీశుల ఆర్థిక సహకారం పత్రికారంగం వ్యాప్తిలో చెప్పుకోదగ్గ పాత్రే నిర్వహించింది.

అయితే హైదరాబాద్ రాజ్యంలో తెలుగువారి ఆత్మగౌరవ ఆరాటంలో భాగంగా గ్రంథాలయోద్యమం, ఆంధ్ర జనసంఘం ఉనికిలోకి వచ్చిన తరువాత అవి రాజపోషకుల అవసరం లేకుండా పత్రికారంగాన్ని తమ పురోగమనంలో భాగం చేసి ముందుకు నడిపించాయి. 1920లలో ప్రచురించనారంభించిన నీలగిరి, తెనుగు పత్రిక, గోలకొండ ఈ ఒరవడిలో ఆవిర్భవించినవే. వీటికి (ముఖ్యంగా సురవరం ప్రతాపరెడ్డి గారి గోలకొండకు) సంస్థానాధీశుల అండదండలు లేకపోలేదు గానీ వాటికి జవసత్వాలు కల్పించింది ఆంధ్ర జనసంఘమూ, గ్రంథాలయోద్యమమూ.

సంస్థానాధీశులు, దేశ్‌ముఖ్‌లు పోషించినంత మాత్రాన పత్రిక అనుసరించిన సంపాదక విధానాలపైన, తాత్విక దృక్పథంపైన వారి ప్రయోజనాల ప్రభావం నూటికి

నూరుపాళ్ళు ఉండి తీరుతుందని అనలేం. కానీ పత్రికల నిర్వాహకులే కొన్ని పరిమితమైన సామాజిక వర్గాలకు చెందిన వారయినట్లయితే దాని ప్రభావం గణనీయంగా ఉండక మానదు. తెలంగాణ పత్రికారంగం పైన బ్రాహ్మణీకం ముద్ర బలంగా ఉండిందని ఈ పుస్తకాన్ని చదివితే అర్థం అవుతుంది. ఈ పుస్తకంలో విశ్లేషణ కంటే విషయ సేకరణకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినప్పటికీ వేరొక సందర్భమైతే ఇది ప్రస్తావనకు తప్పక వచ్చి ఉండేది. పత్రికా రంగం ఆవిర్భావము, ఎదుగుదల నూటికి తొంభై పాళ్ళు బ్రాహ్మణుల చేతిమీదుగా జరగడం దాని స్వభావ స్వరూపాలపైన బలమైన ప్రభావం వేసి ఉంటుందన్న కామెంట్ సహితం కనిపించకపోవడానికి సమకాలీన తెలంగాణ చైతన్యం పైన 'భౌగోళిక తెలంగాణ వాదం' ప్రభావం బలంగా ఉండడమే కారణం అయి ఉండాలి. ఈ పుస్తకంలోని విలువైన సమాచారాన్ని రేపు విశ్లేషణ కోసం ఉపయోగించుకునేవారు అదే వైఖరిని అనుసరించరని ఆశిద్దాం.

స్పష్టమైన కరణీకపు వాసన ఉన్న 'షబ్నవీస్' అన్న పదాన్ని పుస్తకం శీర్షికగా శ్రీనివాస్ ఎంచుకోగలిగారంటేనే ఈ 'భౌగోళిక' దృష్టి వల్ల రాగల దృష్టి లోపం స్వల్పం కాదని అర్థం అవుతుంది. 'షబ్నవీస్' అనేది రాత్రివేళ సహితం రాయగలవారు అన్న ప్రశంసాపూర్వకమైన బిరుదం అనీ, తరతరాలుగా కరణీకపు వృత్తి చేసిన 'నీలగిరి' పత్రిక వ్యవస్థాపకులు వెంకట రామనరసింహారావు గారి కుటుంబానికి నిజాం ప్రభువులు ఆ బిరుదు ఇచ్చి ఉంటారనీ, ఆ బిరుదు ఇంటిపేరయి వారు షబ్నవీస్ వెంకట రామనరసింహారావుగా బదలాయింపు చెంది ఉంటారనీ రచయిత వ్యాఖ్యానం. ఉర్దూ బాగా తెలిసిన మిత్రుడొకరితో ఈ విషయం చర్చించగా షబ్నవీస్ అనేది ఒక కరణీకపు వృత్తి విశేషం అని అర్థమైంది. పాలనా సంబంధమైన లేఖనం కరణీకపు వృత్తి. ఫర్మానాలు రాసే లేఖకుడిని 'ఫడ్నవీస్' అన్నట్టు రాత్రివేళ రాజాస్థానాల వ్యవహారాలను రికార్డు చేసేవాడిని 'షబ్నవీస్' అనేవారు. వృత్తి ఇంటిపేరుగా మారడం కొత్త సంగతి కాదు. ఉత్తర భారతదేశంలో కరణీకపు వృత్తిని కాయస్తులు, కరణ్‌లు చేపట్టగా తెలుగు నేలలో అది బ్రాహ్మణుల గుత్త అయింది. కరణీకం చేసిన వాళ్ళే తొలినాడు పత్రికారంగంలో ముందు ఉండడంలో ఆశ్చర్యపోవలసింది ఏమీలేదు. ఎటొచ్చీ అది పత్రికారంగం స్వభావంపైన ప్రభావం వేసి ఉండగలదన్న స్పృహ కొరవడడం సబబు కాదు.

ఒక పర్యవసానాన్ని రచయితే ఏ వ్యాఖ్యానం లేకుండా ప్రస్తావించారు. సురవరం ప్రతాపరెడ్డి గారు గోలకొండ పత్రిక స్థాపించగానే అది రెడ్ల కొరకు ఏర్పడిందని

'కొందరు శంకించార'ంట. ఎవరు శంకించి ఉంటారో చెప్పకపోయినా ఊహించటం కష్టం కాదు! ప్రతాపరెడ్డి గారు ఆ శంకకు వివరంగా జవాబు చెప్పుకున్నారట కూడా. 'నీలగిరి' వ్యవస్థాపకులైన షబ్నవీస్ వెంకట రామనరసింహారావు గారికి గానీ, అంతకంటే ముందు మహబూబ్‌నగర్ నుండి 'హితబోధిని'ని నిర్వహించిన బండారు శ్రీనివాస శర్మకు గానీ, 'తెనుగు పత్రిక' నిర్వాహకులైన ఒద్దిరాజు సోదరులకు గానీ ఇటువంటి అగత్యం వచ్చి ఉండదు.

తెలంగాణ పత్రికారంగం వైతాళికుల కృషిని, తెలంగాణలో సామాజిక వికాసానికి అది చేసిన మేలునూ తక్కువ చేయడం నా ఉద్దేశం కాదు. ఆ కృషిని సమగ్ర దృష్టితో అన్ని కోణాల నుంచి చూడడంలో తప్పేమీ లేదని చెప్పడం మాత్రమే నా ఉద్దేశం. తెలంగాణ మీది అభిమానం మళ్ళీ ఎప్పుడో నాలుగు దెబ్బలు తిన్న తరువాత వర్గ స్పృహనూ వర్ణ స్పృహనూ కొత్తగా నేర్చుకోవలసిన అవసరం లేదు. మొదటి నుండీ ఆ స్పృహతో వ్యవహరించినట్టయితే ఆ నాలుగు దెబ్బలూ తప్పించుకోవచ్చునేమో కూడా. ఈ మాటలు నేను కేవలం పత్రికారంగాన్ని ఉద్దేశించి మాత్రమే అనడం లేదని ఎవరూ శంకించనవసరం లేదు. నేనే ఒప్పేసుకుంటున్నాను.

కాగా, తొలినాటి పత్రికల నిర్వాహకుల సాహసం, త్యాగం ఆశ్చర్యం కలిగించక మానవు. హైదరాబాద్ సంస్థానంలో తెలుగు చదివే విద్యావంతుల సంఖ్య చాలా తక్కువ. సభ్యసమాజంలో తెలుగు భాషకు గౌరవమూ తక్కువ. తెలుగు వారు సహితం చేతిలో (భాష వచ్చినా రాకున్నా) ఉర్దూ పత్రిక పట్టుకొని కనబడడానికే ఇష్టపడేవారు. అధికార భాష ఉర్దూ కాగా దాని తరువాత గౌరవ మర్యాదలు పొందిన భాషలు హిందీ, మరాఠీ. ఆ నేపథ్యంలో, తెలుగు ప్రజల ఆత్మగౌరవ ఆరాటంలో భాగంగా తెలుగు పత్రికలు ఆవిర్భవించాయి. వాటికి పెట్టుబడి, పాఠకులు, రచయితలు, విలేఖరులు అన్నీ సమస్యలే. గ్రంథాలయోద్యమం, ఆంధ్ర జనసంఘం వెనువెంటనే రావడం పత్రికారంగానికి ఊతం ఇచ్చినప్పటికీ (తిరిగి తాము ఊతం పొందినప్పటికీ) పత్రికా నిర్వహణ పెద్ద భారంగానే ఉండింది. తెలంగాణకు వెలుపల ఉన్న ('బ్రిటిషాంధ్ర') తెలుగు వారి చిన్నచూపు ఈ భారాన్ని మరింత పెంచింది.

ఇటువంటి పరిస్థితులలో తెలంగాణలో తొలి స్వతంత్ర తెలుగు పత్రిక హితబోధిని 1913లో మహబూబ్‌నగర్ నుండి ప్రచురించబడడం ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కూడా

కలిగిస్తుంది. ఈ రోజు సహితం ఎవరైనా ఒక పత్రికా ప్రచురణకు మహబూబ్‌నగర్‌ను ఎంచుకునే సాహసం చేస్తారనుకోను! కానీ 90 ఏళ్ళ కింద ఆయుర్వేద వైద్యుడు శ్రీనివాసశర్మ ఆ సాహసం చేయడమే కాక తెలంగాణ పత్రికా రంగానికి బాటవేసి చూపించారు.

వెనువెంటనే పుట్టిన తెనుగు పత్రిక (1921) ప్రచురణ వరంగల్ జిల్లాలోని ఇనుగుర్తి నుండి జరగడం ఇంకా ఆశ్చర్యం కలిగించే విషయం. నిన్న మొన్న 'కాడా' రోడ్లు వచ్చేంతవరకు ఇనుగుర్తికి మట్టిరోడ్డు, మెటల్ రోడ్డే తప్ప డాంబర్ రోడ్డు కూడా లేదు. రైలులో వెళ్ళి కేసముద్రంలో దిగినా, మహబూబాబాద్‌లో దిగినా దుబ్బనూ, ఎండ వేడినీ తిట్టుకుంటూ ఇనుగుర్తికి పోవలసిందే. అటువంటి ఊరికి ఆనాడే మద్రాసు నుండి ముద్రణాలయం తీసుకొచ్చి పత్రిక అచ్చువేసే పట్టుదలను మెచ్చుకోవలసిందే. (ఆ ఊరి 'మట్టి' గొప్పతనమేమో గానీ అదే పట్టుదలతో తరువాతి కాలంలో ఇనుగుర్తి వాసులు క్రీడలలో రాణించారు. వాలీబాల్ క్రీడలో జాతీయ స్థాయిలోనే గుర్తింపు పొందారు.)

తొలినాటి తెలంగాణ పత్రికలు దినపత్రికలు కావు కాబట్టి కేవలం వార్తాపత్రికలూ కావు. ఆంధ్రప్రాంతంలాగ ఇక్కడ కూడా క్రైస్తవ మత ప్రచారంలో భాగంగా వెలిసిన పత్రికలున్నాయి. హైందవ ధర్మ ప్రచారం లక్ష్యంగా గల పత్రికలూ ఉన్నాయి. 'ఆది హిందువుల' (ఈనాటి భాషలో దళితుల) సమస్యలనూ, ఆకాంక్షలనూ వ్యక్తీకరించిన పత్రికలు రెండున్నాయి. (రెండింటి స్థాపకులూ భాగ్యరెడ్డి వర్మ గారే.) వృత్తి కులాలలో పద్మశాలీలకు ప్రాతినిధ్యం వహించిన పత్రికలు మూడు ఉన్నాయి. రైతులనూ, వ్యవసాయ రంగాన్నీ లక్ష్యంగా పెట్టుకున్న పత్రికలూన్నాయి. బడి పిల్లలనూ అధ్యాపకులనూ లక్ష్యంగా పెట్టుకున్నవీ ఉన్నాయి. సాహిత్య పత్రికలు చాలా ఉన్నాయి. అయితే ప్రధాన పత్రికలైన నీలగిరి, తెనుగుపత్రిక, గోలకొండ మొదలైనవి ఏకసమయంలో వార్తాపత్రికలు, సాహిత్య పత్రికలు, సమాజ సంస్కరణ కృషికి వేదికలు. అన్నిటినీ మించి హైదరాబాద్ సంస్థానంలో తెలుగు ప్రజల ఆత్మగౌరవ వేదికలు. అందువల్ల 20వ శతాబ్దపు తొలి అర్ధభాగానికి చెందిన తెలంగాణ ప్రాంతపు సాహిత్య, సామాజిక, రాజకీయ రంగాలకు చెందిన ప్రముఖులందరి పేర్లూ పత్రికారంగం చరిత్రలో కనిపిస్తాయి.

సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు. భాగ్యరెడ్డి వర్మ, దేవులపల్లి రామానుజరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, రావి నారాయణరెడ్డి. పాములపర్తి సదాశివరావు, బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకట రంగారెడ్డి, కోదాటి రామకృష్ణారావు – ఇలా తెలంగాణ పత్రికారంగం వికాసానికి కృషి చేసిన, లేక తోడ్పడిన వారి జాబితా రాస్తే మొత్తంగానే తొలినాటి తెలంగాణ ప్రముఖుల జాబితా, తెలంగాణ సామాజిక రాజకీయ జీవితాన్ని రూపకల్పన చేసిన ప్రముఖుల జాబితా అవుతుంది. తెలంగాణలో తొలినాటి పత్రికారంగం సామాజిక మార్పుతోనూ, కృషితోనూ అంతగా పెనవేసుకొని ఉంది. అందువల్ల పత్రికారంగం చరిత్రకు ఆధారం కాగల ముడి సమాచారాన్ని అందజేసే ఈ పుస్తకం తెలంగాణ సామాజిక చరిత్ర రచనకూ అదే మోతాదులో తోడ్పడగలదు.

విలువైన సమాచారాన్ని విషయ నిమగ్నతతో సేకరించి ఒకచోట ఇచ్చిన ఈ పుస్తకాన్ని ఇంకొంచెం శ్రద్ధగా ఎడిట్ చేసి ఉంటే బాగుండేది. పునరుక్తి దోషమూ, వ్యాకరణ దోషాలూ ఉండకూడనన్ని ఉన్నాయి. తెలంగాణకు చెందిన తొలి స్వతంత్ర తెలుగు పత్రిక అయినంత మాత్రన హితబోధిని గురించి ప్రతి విషయమూ రెండుసార్లు చెప్పవలసిన అవసరం లేకుండె. వ్యాకరణం మాటకొస్తే వాక్యం పొడవయితే కర్తను రెండవసారి ప్రవేశపెట్టే దోషం ఉపన్యాసకులలో తరచుగా కనిపిస్తుంది. పండితులు ఈ దోషాన్ని ఏమంటారో గానీ, వచనంలో ఇది దొర్లడం అజాగ్రత్త ఫలితమే. 'ఈ పత్రికలో' అని మొదలుపెట్టి 'ఈ పత్రికలో ఉంది' అని ముగించే తరహా వాక్యాలు ఈ పుస్తకంలో డజను దాకా ఉన్నాయి.

తెలంగాణ ప్రజలు తమను తాము తెలుసుకోవడం కోసం చేస్తున్న కృషిలో భాగంగా ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నట్టు ప్రచురణకర్తలు (కవిలె) చెప్పారు. తెలంగాణ ప్రజలే కాక తెలంగాణను ప్రేమించే వారందరూ ఈ కృషిని ఆహ్వానిస్తారు. ఇంకా జరగాలని కోరుకుంటారు.

*ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం*

*15 ఆగస్టు 2004*

# తెలంగాణ ఉద్యమాన్ని డ్రామా కంపెనీ కానీయొద్దు

రాజకీయాలు ఒక 'షో' అనేది మన దేశంలోని రాజకీయవేత్తలందరూ ఎరిగిన విషయం. 'షో' అంటే ప్రదర్శన, లేక ప్రదర్శనాత్మకమైన ప్రక్రియ అని అర్థం.

తెలంగాణ రాష్ట్ర సమితి ఈ విషయం మనకు మరొొక్కసారి జ్ఞాపకం చేస్తున్నది. తెలంగాణ సాధనకు ఉద్యమాలూ, పోరాటాలూ, త్యాగాలూ వద్దు అనీ, రాజకీయంగా సాధిస్తామనీ చంద్రశేఖరరావు ఒకనాడు అన్న సంగతి అందరికీ గుర్తుండే ఉంటుంది. ఇప్పుడాయనే స్వయంగా చేత కర్రబట్టిన జాగరణ సేనను ఆవిష్కరించాడు. ఇది పోరాటాలూ, త్యాగాలూ చేయడానికి, లేదా చేయించడానికి కాకపోతే మరెందుకు?

కర్రలతో పోరాటాలు చేసే రోజులెప్పుడో పోయాయి కాబట్టి అది సంకేతాత్మకం లేదా ప్రదర్శనాత్మకం అనుకోవాలి. అయితే జాగరణ సేన చేతిలోని కర్రలు దేనిని ప్రదర్శిస్తున్నాయి? దేనికి సంకేతంగా నిలిచాయి?

ఆర్.ఎస్.ఎస్ కు అనేది వెంటనే ఎవరికయినా తోచే జవాబు. ఆ మాట ఇప్పటికి చాలామందే – కేశవరావు నుండి బి.వి. రాఘవులు దాకా అన్నారు. అయితే 'ఆర్.ఎస్.ఎస్' తరహా 'క్రమశిక్షణ' వల్ల తెలంగాణ రాష్ట్ర సాధనకు ఏమొస్తుంది? వాళ్ళ ఖాకీ నిక్కర్లు, వాళ్ళ కర్రలు విధ్వంసకరమైన అల్లర్లకు

కారణమయ్యాయి తప్ప అభ్యుదయకరమైన ఏ పోరాటాన్నీ ఇప్పటిదాకా నడపలేదు. ద్వేషం, సంకుచితత్వం ఆర్.ఎస్.ఎస్ ట్రేడ్ మార్కు గుణాలు. అన్యాయం ఉన్నచోట దానిపట్ల ద్వేషమూ ఉంటుంది గానీ, ద్వేషం చేత రూపొందిన ప్రాపంచిక దృక్పథం మానవీయ ఫలితాలనెప్పుడూ ఇవ్వదు. అయినా ఆర్.ఎస్.ఎస్. నేర్పించే ద్వేషం – దుర్మార్గం పట్ల ద్వేషం కూడా కాదు. సంకుచితమైన గుర్తింపు నుంచి పుట్టిన అహంకారపూరితమైన ద్వేషం. అది తెలంగాణకెందుకు?

ఉద్యమాలూ పోరాటాలూ అక్కరలేదు, రాజకీయంగా తెలంగాణ సాధిస్తాం అన్న వ్యూహం సోనియాగాంధి గడప దగ్గర ఆగిపోయింది. 'ఆమె నిర్ణయిస్తుంది' అంటున్నారు. ఆమె స్వంతంగా ఏ నిర్ణయం తీసుకోజాలదని అందరికీ తెలుసును. ఆమె నిర్ణయిస్తుందంటే అర్థం కాంగ్రెస్ పార్టీలోని ముఠాల, గ్రూపుల ప్రయోజనాల చదరంగం నిర్ణయిస్తుందని. అవి అనుకూలించిన రోజు అనుకూలించిన నిర్ణయం జరుగుతుంది. అయితే అది 'భగవంతుని లీల' లాంటిది. అంతే స్పష్టమైనది, అంతే నమ్మదగ్గది. పోరాటాలూ, ఉద్యమాలూ, చావులూ ఎందుకు, మన కర్మ బాగున్నప్పుడు తెలంగాణ వస్తుంది అనో, భగవంతుడు దయ తలచినప్పుడు వస్తుంది అనో అనడానికీ సోనియాగాంధి నిర్ణయించినప్పుడు వస్తుంది అనడానికీ మౌలికమైన తేడా ఏమీ లేదు. మొదటి దానిని విజ్ఞత గల అభిప్రాయంగా భావించే దశ దాటిపోయాం అనుకున్న వారు రెండవ దానిని సహించడం ఆశ్చర్యమే.

ప్రజలను సమీకరించి ఉద్యమాలు నిర్మించడం ద్వారానే రాజకీయ మార్పులు వస్తాయన్న అభిప్రాయం వామపక్ష భావాలు గల తెలంగాణవాదులకు సహితం ఒక సంవత్సరం కింద అకస్మాత్తుగా పాతచింతకాయ పచ్చడిగా తోచసాగింది. ఎప్పటికీ రాబోని విప్లవం లాంటి వాటికి ఆ నీతి సరిపోతుందేమో గానీ, మన జీవితకాలంలో చూడగల మార్పులకు అంతకంటే సమర్థమైన షార్ట్‌కట్‌లు ఉంటాయని భావించారు. ఉండగలవు. తెలంగాణకేమిటి, విప్లవానికీ వుండగలవు. కాంక్షనీయమైన మార్పులకు ఆకర్షణీయమైన మార్గాలే సమర్థవంతమైన సాధనాలనేది 19వ శతాబ్దపు యూరోపియన్ భ్రమ. అది ఇబ్బందికరమైన నైతిక నిర్ణయాలు చేయవలసిన అవసరం లేకుండా చేసే భ్రమ. ఉన్నతమైన లక్ష్యాలకు ఉన్నతమైన మార్గాలే సమర్థమైన సాధనాలయితే లక్ష్యం – సాధనం అన్న నైతిక మీమాంసలో ఇబ్బంది ఏముంది?

కాబట్టి ఢిల్లీలో కూర్చొని శరద్‌పవార్‌ను, లాలూ యాదవ్‌ను ఇంకా ఇతర చిన్నాచితక నాయకులనూ ఒప్పించడం ద్వారా కాంగ్రెస్ పార్టీపైన ఒత్తిడి పెట్టడం నిరర్థకమైన కార్యక్రమం అని ఎవరూ అనలేదు. ఏం చెప్పగలం– దాని ప్రయోజనం దానికి ఉండగలదు. అయితే ఇది కాంగ్రెస్ పార్టీ విధాన నిర్ణయాలపైన రాజకీయ సమీకరణల ఒత్తిడి తెచ్చే ప్రయత్నం. ఆ పార్టీ చరిత్ర తెలిసిన వారందరికీ ఇదెంత కష్టమో తెలుసును. దేవుడికి మొక్కుకొని కాచుకొని కూర్చొనడానికీ దీనికీ మౌలికమైన తేడా లేదు.

ఈ లోపల ఏం జరుగుతుంటుంది? తెలంగాణకు నష్టకరమైన చాలా నిర్ణయాలు జరిగిపోతుంటాయి. పులిచింతల, పోలవరం వంటి ప్రాజెక్టుల నిర్మాణం ఎదురుచెప్పే వాళ్ళు లేకుండ జరిగిపోతుంటాయి. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం అవసరం అన్న అభిప్రాయం తెలంగాణ ప్రజలు నిత్యజీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలతో సంబంధం లేని ఒక రాజకీయ భావనగా ఉండిపోతుంది. నిన్నటి విధానాలకూ నేటి మాటలకూ పొంతనలేని చంద్రబాబునాయుడి సిగ్గుమాలిన రాజకీయ ప్రచారం తెలంగాణలోనూ ప్రజాదరణ పొందుతుంది.

రాజకీయ లక్ష్యాలను ప్రజా ఉద్యమాల ద్వారా సాధించాలనే వ్యూహం అన్నిటికంటే సమర్థవంతమైనది కాకపోవచ్చు. అయితే అది ఉద్యమ లక్ష్యాలకు గట్టి పునాది వేసుకొంటూ పోయే వ్యూహం. చివరకు లక్ష్యం సిద్ధించినా సిద్ధించకున్నా ఈ లోపల అది సమాజాన్ని ఆ దిశగా నడిపిస్తుంది. సమాజం ఆలోచనారీతులను ఆ దిశగా మలుస్తుంది. 'ఇవన్నీ తెలంగాణ రాకుండా చేసే అక్కరకు రాని నీతి మాటలు' అని ఒక సంవత్సరం కింద కొట్టిపారేసినవాళ్ళు సహితం ఈ విషయాన్ని ఈ రోజు గ్రహిస్తున్నారనుకుంటాను.

ఢిల్లీలో జరిపే రాజకీయ కేళి జరుపుతూనే తెలంగాణలో వివిధ సమస్యల మీద ప్రజా ఉద్యమాలు నడపడం ఉచితమైన వ్యూహం అయి వుండేది. ఒక సంవత్సరం క్రితం ఇది అనవసరం అనుకున్నవారు సహితం ఈ ఆవశ్యకతను ఇప్పుడు గుర్తించగలరను కుంటాను. ఈ పాటికే ఒక పోలవరం వ్యతిరేక ఉద్యమమో, ఒక సింగరేణి పరిరక్షణ ఉద్యమమో ఉధృతంగా మొదలు కావలసింది. ఇప్పుడైనా ఆ పని చేసే బదులు కర్రలు పట్టుకొని డ్రిల్లు చేసే ఈ దండు ఏర్పాటు ఎందుకు చేసినట్టు?

ఇది దానికోసమే అనబోతారు. రాగల ప్రజా ఉద్యమాలకు అవసరమైన కార్యకర్తల తయారీయే ఈ సేన అనబోతారు. ఇంత 'షో' చేసి ఉద్యమాలను ప్రారంభించేవారికి నిజంగా కావలసింది ఉద్యమాలా లేక ఈ ప్రదర్శన ఫలమేనా అని సందేహించే హక్కు మనకు ఉంది. ఢిల్లీలో రాజకీయాలను ఒక 'షో'గానే నడిపారు. కాంగ్రెస్‌తో తెగతెంపులు ఒక 'షో'గానే చేసుకున్నారు. స్కూలు పిల్లలు సహితం సిగ్గుపడే తిట్ల మంత్రాలతో ఆ తంతు ముగించారు. ఇప్పుడు ప్రజలలోకి పోవడం అనేది ఇంకొక 'షో'గా ప్రారంభించారు. డ్రామా కంపెనీలకు నాటకీయ ప్రదర్శన మీద మోజే తప్ప విషయం మీద ఆసక్తి ప్రధానం కాదని అందరికీ తెలుసు. తెరాస వ్యవహారం అంతకంటే భిన్నంగా ఉండబోతుందని రుజువు చేస్తే ఒప్పుకోవడానికి సిద్ధమేగానీ గుడ్డిగా నమ్మమంటే కష్టం.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*25 సెప్టెంబర్ 2005*

# తెలంగాణ ఉద్యమానికి కొన్ని హితోక్తులు

మొత్తానికి తెలంగాణ పైరవీల నుండి బయటపడి ఉద్యమం భాష మాట్లాడడం మొదలుపెట్టింది. ప్రజల సమస్యలు ఉద్యమాల ద్వారానే పరిష్కారం అవుతాయని చాలాకాలం అందరికీ చెప్పి, తెలంగాణ విషయం వచ్చేసరికి ప్రజా ఉద్యమాలు ఉద్యమకారులకు ఆత్మసంతృప్తి ఇవ్వడానికే పనికొస్తాయనీ, తెలంగాణను రాజకీయ చతురతే సాధిస్తుందని సూత్రీకరించిన మిత్రులు ఈ రెండేళ్ళ అనుభవాన్ని ఏ విధంగా సమీక్షించుకుంటున్నారో!

ఉద్యమాలు లక్ష్యాన్ని సాధించవచ్చు, సాధించకపోవచ్చు కానీ ఉద్యమించే క్రమం లక్ష్యం దిశగా సామాజిక విలువలను పెంపొందిస్తుంది. రాజకీయ చతురత కూడా లక్ష్యాన్ని సాధించవచ్చు, సాధించకపోవచ్చు కానీ ఆ లోపల సామాజిక విలువలను ధ్వంసం చేస్తుంది. టి.ఆర్.ఎస్ ఎత్తుగడలతో వచ్చిన ఫలితం ఇదే కాదా? తెలంగాణ డిమాండ్ న్యాయమైనదన్న ఒక విషయాన్ని పక్కన పెడితే టి.ఆర్.ఎస్ వ్యవహారశైలిలో మెచ్చుకోదగ్గది ఏమైనా ఉందా? ఏ కోశానా ప్రజాస్వామ్య సంస్కృతి లేని కెసిఆర్ అధినాయకుడు, మాట్లాడడానికీ నోరు పారేసుకోవడానికీ తేడా తెలియని నరేంద్ర అధికార ప్రతినిధి, ఇక మిగిలిన వాళ్ళు నిందలు వేయడమూ, మోయడమూ డ్యూటీగా

గలవాళ్ళు - ఇదేగా తెలంగాణ రథసారథి అయిన పార్టీ ముఖచిత్రం? చాలా తెలివిగలదయిన తెలుగు మీడియా టి.ఆర్.ఎస్‌ను విస్మరించి అణగదొక్కే బదులు నరేంద్ర చేత నిత్యం నోరు పారేయించి భ్రష్టుపట్టించాలని నిర్ణయించుకుంది. అతని నోరు మూయించమని అధినాయకుడిని అడిగే పాటి నోరున్నవాళ్ళు తెలంగాణ ఉ ద్యమంలో లేకుండా పోయారు.

ఉద్యమించాలన్న నిర్ణయం తీసుకోవడం ఒకెత్తు, నిజంగానే ఉద్యమించడం వేరొకెత్తు. రచ్చ చేయడం, అల్లరి చేయడం వేరే. గుంపు ఉండి, న్యాయం కోసం నిలబడ్డామన్న ఆత్మవిశ్వాసం ఉండి, రాజకీయంగా సున్నితమైన విషయం కాబట్టి పోలీసులు వెంటనే మీదపడి చావగొట్టరన్న భరోసా కూడా ఉంటే రచ్చ, అల్లరి పెద్ద కష్టం కాదు. తెలంగాణకు ప్రస్తుతం ఈ మూడూ ఉన్నాయి. మూడవది ఎంత కాలం ఉంటుందో చెప్పలేము గానీ మొదటి రెండూ ఉంటాయి.

ఉద్యమించడం వేరే విషయం. దానికి చాలా ఓపిక కావాలి, ప్రజల సమస్యల మీద అధ్యయనం కావాలి, తక్షణ సమస్యలను దీర్ఘకాలిక లక్ష్యాలతో ముడిపెట్టి వివరించే సామర్థ్యం కావాలి, అన్నిటిని మించి ప్రజలను కదిలించే నేర్పు కావాలి. టి.ఆర్.ఎస్ నుండి ఇవేవీ ఆశించే అవకాశం లేదు గానీ వారి రాజకీయ చతురతే తెలంగాణ సాధించి పెడుతుందని నమ్మి ఇన్నాళ్ళు ఊరుకున్న ఉద్యమ అనుభవమున్న తెలంగాణవాదులయినా ఎప్పుడో మొదలు కావలసిన కృషిని ఇకనైనా మొదలుపెడతారని ఆశిద్దాం.

పోతే, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఎందుకు అన్న ప్రశ్నకు జవాబును ప్రస్తుత రాజకీయ నీతి ఆమోదించే కారణాల చట్రంలోనే వెతుక్కోవడం తప్పనిసరి అని తెలంగాణ వాదులు భావించడం అనవసరమేమో. అలా భావించడం వల్లనే తరచుగా కృత్రిమ తర్కాన్ని ఆశ్రయించడం జరుగుతున్నది. రైతాంగం దేశవ్యాప్తంగా ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని తెలంగాణకు ప్రత్యేకమైన సమస్యగా చూపించడం, దేశ రాజకీయార్థిక విధానాలలో నెలకొన్న వైపరీత్యాల పర్యవసానాలయిన నిరుద్యోగం వంటి సమస్యలను రాష్ట్ర పాలనా విధానాలలోని వివక్ష ఫలితమని వాదించడం వింటున్నాం. సార్వజనీన సమస్యలకు ప్రత్యేకమైన కోణాలుంటాయి, ఉండవని కాదు. వివక్ష ఉన్నచోట అవి మరింత తీవ్రమూ అవుతాయి, కావని కాదు. కాని ఆ ప్రత్యేకత పాలు ఎంత అనే హేతుబద్ధమైన వివేచనకు

సున్నితమైన విశ్లేషణ కావాలి. అది కొరవడినచోట దబాయింపు గోచరించే ప్రమాదం ఉంది. వరంగల్‌కు చెందిన ఒక మిత్రుడితో ప్రకాశం జిల్లా గిద్దలూరు ప్రాంతంలో తిరుగుతున్నప్పుడు 'ఇంత కరువు నేను తెలంగాణలో కూడా ఎప్పుడూ చూడలేదే' అని ఆశ్చర్యపోయాడు. అతను వరంగల్‌కి కాక నల్గొండకో మహబూబ్‌నగర్‌కో చెందిన వాడయితే కొంచెం తక్కువ ఆశ్చర్యపోయేవాడేమో గానీ, తెలంగాణలో కరువుకు ప్రాంతీయ వివక్షే కారణం అని నమ్మడం అలవరచుకున్న వారెవరయినా గిద్దలూరుకో, గుంటూరు జిల్లాలోని బొల్లాపల్లికో పోతే ఆశ్చర్యపోక మానరు.

'అభివృద్ధి' అనేది ప్రస్తుత రాజకీయ నీతి ఆమోదించే ఏకైక ప్రమాణం. ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ అభివృద్ధి చెందదనీ, ప్రాంతీయ వివక్షే దానికి కారణమనీ వాదిస్తేనే ఈ ప్రమాణం ప్రకారం ప్రత్యేక రాష్ట్రం సమర్థనీయం అవుతుంది. ఈ రాజకీయ నీతి దేనినయితే 'అభివృద్ధి' అంటుందో అది కాంక్షనీయమా అన్న ప్రశ్న కొంచెంసేపు పక్కన పెట్టినా (తెలంగాణకు ఈ అభివృద్ధి వచ్చేసి వరంగల్, విజయవాడలాగ తయారయితే నాకయితే చూడబుద్ధి కాదు), ఈ ప్రమాణాన్ని బలవంతంగా ఆమోదించి ఆ చట్రంలో తెలంగాణవాదాన్ని సమర్థించే ప్రయత్నం చేయడం తార్కిక కృత్రిమత్వానికి తరచుగా దారితీస్తున్నది. నదీజలాల విషయంలో మాత్రమే ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు ఎప్పటికీ న్యాయం జరగదు అని కచ్చితంగా చెప్పవచ్చు. మిగిలిన విషయాలలో అంత కచ్చితంగా చెప్పలేం. ఈ కోణంలో ఎక్కువగా వినిపిస్తున్న వాదనలకు హేతువు విద్యారంగంలో వెనుకబాటుతనం (ఈ ఒక్క విషయంలో తెలంగాణ రాయలసీమ కంటే కూడా వెనుకబడి ఉంది). ఇది ఉమ్మడి రాష్ట్రంలో ఇంకా యాభైఏళ్ళకు కూడా పోదని అనగలమా? చెప్పటం కష్టం.

అయితే ప్రస్తుత అధికార దృక్కోణం డిమాండ్ చేసిందని 'అభివృద్ధి' సాధ్యమా, అసాధ్యమా అన్న చట్రంలోనే ఎందుకు వాదించాలి? 'మేమంతా ఒకటి కాబట్టి ఒక పాలనా వ్యవస్థలో బతకదలచుకొన్నాం' అనే వాదన ఎందుకు సరిపోదు? ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో తెలుగువాళ్ళు అభివృద్ధి చెందనే చెందరనే ప్రత్యేక రాష్ట్రం అడిగారా? మద్రాసు మాదే అనేంతగా ఆ రాష్ట్ర రాజధాని పైననే తెలుగువాళ్ళు పట్టు నెలకొల్పారే! అయినప్పటికీ వాళ్ళు వేరు, మేము వేరు అనే కదా ప్రత్యేక రాష్ట్రం కోరారు? ఈ 'వేరేతనం' తెలంగాణకు కావలసినంత ఉంది. భాషలో, నడవడికలో, మాటతీరులో తెలంగాణ వాసులను రాష్ట్రంలో ఎక్కడయినా వెంటనే గుర్తుపట్టవచ్చు. 'సంస్కృతి' అని పిలవబడే అనిర్వచనీయమైన జీవన లక్షణంలో స్పష్టమైన ప్రత్యేకత తెలంగాణకు–

కనీసం ఉత్తర తెలంగాణకు – ఉంది. ఉన్నంత మాత్రాన వేరే రాష్ట్రం కోరుకోవలసిందేనా అంటే, కోరుకోక పోవచ్చును గానీ తెలంగాణలో ఉన్నట్టు ప్రగాఢమైన కోరిక ఉన్నప్పుడు అది న్యాయసమ్మతం కాదనడానికి వీలులేదు – ఆ ప్రాంతానికి ఒక రాష్ట్రంగా మనగలగడానికి అవసరమైన ఇతర లక్షణాలు ఉన్నట్టయితే. తెలుగువాళ్ళు తమిళుల కంటే వేరయినంత మాత్రాన వేరే రాష్ట్రం కోరి ఉండనక్కరలేదు. కానీ కోరడం తప్పు కాదని ఆనాడు అత్యధికులు గుర్తించారు. ఇతర రాష్ట్రాలలోను దానిని అనుసరించారు.

ఇంక ఉద్యమించవలసిన సమస్యల విషయానికొస్తే చాలానే ఉన్నాయి. పోతిరెడ్డిపాడు సామర్థ్యం పెంపు విషయంలో రచ్చ రూపంలోనైనా కొంత చర్చ జరిగింది. కృష్ణానది ఎగువ భాగాన ఉన్న అన్ని జిల్లాల ఉమ్మడి అవసరం అయిన మిగులు జలాలను (అవి 'మిగులు జలాలు'గానే ఉండి పోనక్కరలేదనేది వేరే విషయం) వచ్చినవి వచ్చినట్టు తీసుకుపోవడానికి కడప జిల్లాకు మాత్రం ఏర్పాటు చేసుకోవడం అన్యాయమనడంలో సందేహమేమీ లేదు. 'మిగులు జలాల ప్రాజెక్టుల' నీటి హక్కు దామాషాను ముందు నిర్ణయించి ఆ తరువాత ఒక్కొక్క దానికీ అవసరమైన వ్యవస్థ ఏర్పాటుచేయమని అడగవచ్చు. లేదా పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యం పెంచినట్టే కల్వకుర్తి, నెట్టెంపాడు, ఎఎంఆర్ ఎత్తిపోతల పథకాల మోటార్ల సంఖ్య రెండు రెట్లు పెంచమనీ, శ్రీశైలం ఎడమగట్టు కాలవ టన్నెల్ వెడల్పు రెండు రెట్లు చేయమనీ అడగవచ్చు. (ఇక్కడ అప్రస్తుతం అనిపించినా, కర్నూలు – అనంతపురం జిల్లాల పడమటి ప్రాంతానికి 'మిగులు జలాలు' ఇయ్యవలసిన హంద్రీ–నీవా గురించి ఏమైనా అడగడానికి దాని టేక్ ఆఫ్ పాయింట్ కూడా ఇంకా నిర్ణయం కాలేదు.) ఈ డిమాండ్లతో ప్రజా ఉద్యమం రాగలదు గానీ అది నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలలో రావాలి. తెలంగాణ ఉద్యమం అక్కడే బలహీనంగా ఉంది.

నల్గొండకు సంబంధించిన సమస్యే మరొకటి ఉంది. ఫ్లోరైడ్ బాధిత ప్రాంతాలయిన మునుగోడు, నారాయణపురం, చౌటుప్పల్ మండలాల పేరుమీద మొదలుపెట్టిన ఎఎంఆర్ ప్రాజెక్టు క్రమంగా హైదరాబాద్ ప్రాజెక్టయిపోయింది. మొదట హైదరాబాద్ కోసం 4 టి.ఎం.సి.లు మాత్రమే తీసుకుంటామన్నారు. దానికోసం ఒక పైప్‌లైన్ వేసారు. ఆ తరువాత అక్కంపల్లి బ్యాలన్సింగ్ రిజర్వాయర్ నుండి హైదరాబాద్‌కు 16 టి.ఎం.సి.లు తీసుకురాబోతారన్న మాట వేరే సందర్భాలలో వినబడసాగింది. ఇప్పుడు

చడీ చప్పుడు లేకుండా దర్జాగా రెండవ పైప్‌లైన్ వేసేస్తున్నారు. ఫ్లోరైడ్ బాధిత గ్రామాల ప్రజలను కదిలించగలిగితే ఒక మంచి ఉద్యమం రాగలదు.

ఇక పులిచింతల గురించయితే అందరూ మరచేపోయినట్టున్నారు. టేల్‌పాండ్ కట్టేదాకా పులిచింతల కట్టొద్దన్న డిమాండ్ అప్పట్లో విన్నాం. టేల్‌పాండ్‌కు అతీగతీ లేదుగానీ పులిచింతల ఆనకట్ట శరవేగంగా పూర్తయిపోతున్నది. కనీసం నిర్వాసితులకు నష్టపరిహారం, పునరావాసం కల్పించకుండా ప్రాజెక్టు పూర్తిచేయొద్దన్న డిమాండ్ కూడా ఇప్పుడు వినరావడం లేదు. ఏ ఆందోళనా, అడ్డు లేకుండా ప్రభుత్వం ప్రాజెక్టును పూర్తిచేసుకుంటూ పోతున్నది. ప్రాజెక్టుకు అవసరమైన నిధులన్నీ మంజూరవుతున్నాయి గానీ భూముల, ఇళ్ళ నష్టపరిహారానికీ, జీవో 68 కింద ఇయ్యవలసిన పునరావాసానికీ మాత్రం నిధులు లేవట. అడిగేవాళ్ళు లేకపోవడం తప్ప వేరే ఏమీ కాదు.

చెప్పుకుంటూ పోతే ఉద్యమించదగ్గ సమస్యలు తెలంగాణలో చాలానే ఉన్నాయి. జరిగిన ఆలస్యం ఎట్లాగూ జరిగింది. ఇకనైనా ఉద్యమాలు చూడబోతామా?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*17 సెప్టెంబర్ 2006*

# కరీంనగర్ ఉపఎన్నికలో ప్రజల సమస్యలెక్కడ?

కరీంనగర్ ఉపఎన్నిక ఫిబ్రవరి దాకా జరగబోదని ఎవరో అంటే విని గాభరా పడ్డాము. ఇంకొక మూడు నెలలు ఈ తిట్లు, సవాళ్ళు, ఈసడింపులు, దూషణలు వింటూ ఉండవలసిందేనా అని భయపడ్డాము. అది డిసెంబర్ 4న జరిగిపోతుందని తెలిసి సంతోషమనిపించింది. ఆ ఎన్నిక తెలంగాణ మీద రెఫరెండమ్ అయినట్టే నడుచుకుంటూ, కాదు కాదని ముందుజాగ్రత్తగా అందరూ అంటున్నారు కాబట్టి ఒక రకంగా ఆ రోజు ఏం జరిగినా ఒకటే. అయినప్పటికీ తెలంగాణను ప్రేమించే వాళ్ళెవరయినా కెసిఆర్ ఓడిపోకూడదనే కోరుకుంటారు. కెసిఆర్ పరువు పోతుందని కాదు. పరువు నిలబెట్టుకోవడానికి ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చేయని వ్యక్తి పరువు పోతే వేరెవరైనా ఎందుకు బాధపడాలి? కానీ తెలంగాణ భావన అవమానానికీ అవహేళనకూ గురి కాకూడదు. కాబట్టి కెసిఆర్ ఓడిపోకూడదు.

అంతకు మించి ఈ ఎన్నికకు వేరే ప్రాముఖ్యమేమీ లేదు. తెలంగాణను వస్తువుగా చేసుకొని టి.ఆర్.ఎస్, కాంగ్రెస్, టి.డి.పిలు రాజకీయాలను ఎంతగా దిగజార్చాలో అంతగా దిగజార్చాయి. ప్రజలకది టిక్కెట్ లేని సర్కస్ అయిపోయింది. చోద్యం అలవాటైపోయి మన ఆలోచనలు

స్తంభించిపోయాయి గానీ, లేకపోతే అసలు ఈ ఉపఎన్నిక ఎందుకోసం వచ్చినట్టు? పార్లమెంటుకు ఎన్నికయిన వ్యక్తి అయిదు సంవత్సరాల లోపల తన రాజకీయ పంథా గనక మార్చుకున్నట్టయితే తన సీటుకు రాజీనామా చేసి, మళ్ళీ అక్కడే ఎన్నికలకు నిలబడితే అందులో కొంచెం అర్థం ఉంది. ఆ ఎన్నిక ఖర్చు పూర్తిగా దండగ కాదని అనుకోవచ్చు. కెసిఆర్ 2004లో ఏ రాజకీయ లక్ష్యంతో పోటీ చేసాడో ఇప్పుడూ అదే లక్ష్యంతో ఉన్నాడు. ఇంకొకసారి అతనికే వోటువేసి ఆ రాజకీయ లక్ష్యం పట్ల కరీంనగర్ ప్రజలు తమ నిబద్ధతను రుజువు చేసుకోవాలా? ఒక దొర ఏదో అన్నాడని ఇంకొక దొర అలిగితే ఆ పంతం ఖర్చు ప్రజలు భరించవలసిందేనా? దొరతనం ఇంకా సజీవంగానే ఉందని రుజువు చేయడం కోసమా ఈ ఉపఎన్నిక?

ఎన్నికయినా ఉపఎన్నికయినా కరీంనగర్ పార్లమెంటు నియోజకవర్గం గురించి మాట్లాడదలచుకుంటే విషయాలు చాలా ఉన్నాయి. ఆ నియోజకవర్గంలో ప్రధాన భాగం ఇవాళ రాష్ట్రంలోని అత్యంత అభివృద్ధి చెందిన ప్రాంతాలతో పోటీపడుతుంది. జగిత్యాల గుడివాడకు ఏ రకంగానూ తీసిపోదు. కానీ శ్రీరాంసాగర్ ఆయకట్టును దాటి కొంచెం దూరం పోతే వార్తలన్నీ చావు కబుర్లే. గడచిన తొమ్మిది సంవత్సరాలుగా సిరిసిల్ల పట్టణంలో పవర్‌లూం కార్మికులు సంవత్సరానికి సగటున 25 మంది ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఒక నియోజకవర్గంలో కాదు; ఒక మండలంలో కాదు; ఈ మధ్యనే మునిసిపాలిటీ అయిన ఒకే ఒక ఊరిలో. ఈ ఊరు గురించి కరీంనగర్ ఉపఎన్నికలో మీరు వినరు. ఎవరికీ తెలియక కాదు. అందరికీ తెలిసే వినరు. ఒకరి దగ్గర బ్రహ్మాండమైన 'అభివృద్ధి' ఉంది, మరొకరి దగ్గర తెలుగు దినపత్రికలు 'సెంటిమెంట్' అని పేరు పెట్టిన భావోద్వేగం ఉంది. ఇంక నేత కార్మికుల శవాలతో ఎవరికేం పని?

ఆ ఊరిలో ఏ గల్లీలోకి తొంగిచూసినా పవర్‌లూం టకటకలు వినిపిస్తాయి. ఇంటి ముంగిట బీడీలు చుట్టుకుంటూ స్త్రీలు కనిపిస్తారు. నేత కార్మికులు చేనేత కార్మికులుగా ఉన్న రోజులలో స్త్రీ పురుషులిద్దరూ కలిసి నేసేవారు. పవర్‌లూంలు వారిని విడదీసాయి. 'సాంచాలు' నడిపే పని మగవారి పని అయింది. గతంలో ఒక మగ్గం మీద భార్యాభర్తలిద్దరూ పనిచేసేది. ఇప్పుడు నాలుగు 'సాంచాల'ను మగవాడు ఒక్కడే నడపగలడు. దాంతో స్త్రీలు పూర్తికాలం బీడీ కార్మికులు అయ్యారు. పొద్దున

లేచిన కాడినుండి రాత్రి పండుకునే దాకా వంట చేసుకుంటూ, పిల్లలను చూసుకుంటూ మధ్యమధ్యలో బీడీలు చుడుతూ ఉంటారు.

ఆర్థికశాస్త్ర సిద్ధాంతాల ప్రకారం ఈ విధంగా ఉత్పాదకత పెరిగి శ్రమ విభజన జరిగినప్పుడు ఆదాయాలు పెరిగి ఉండాలి. అది మాత్రం జరగలేదు. అసలే జరగలేదని కాదు – సిద్ధాంతం చెప్పిన దానిలో పావు వంతు కూడా జరగలేదు. ఒంటిచేత్తో నాలుగు 'సాంచాలు' నడిపే మగవాళ్ళు నెల తిరిగేసరికి 2000 రూపాయలు సంపాదిస్తే ఎక్కువ. మరి ఊరేమో పట్టణం అవుతూ ఉంది. బతుకు ఖర్చు పల్లెటూరి ప్రమాణాలు దాటిపోయింది. పిల్లలకు యూనిఫాం వేసి మెడకు టై కట్టి స్కూలుకు పంపాలి. ఒంట్లో బాగా లేకపోతే కరీంనగర్‌లో వీధివీధిలోనూ వెలిసిన ప్రైవేట్ దవాఖానాలను దర్శించుకోవాలి. నివాసానికి ఎక్కడో ఒకచోట గుడిసె వేసుకోవడానికి వీలులేదు. అద్దె చెల్లించి కిరాయి ఇంట్లో ఉండాలి. రెండు గదుల ఇంటి అద్దె 500 పైనే ఉండగలదు.

ఇంక అప్పులు చేయక గడిచేదెట్లా? ఒక్కొక్క కుటుంబం 50 వేల రూపాయలు పైబడి బాకీ పడి ఉంది. పేదలకు జరుగుబాటుకు అప్పులిచ్చే రుణ వ్యవస్థ భారతదేశంలో లేదు కాబట్టి ప్రైవేటుగానే అప్పులు తీసుకోవాలి. వడ్డీ నెలకు 3 రూపాయల నుండి 5 దాకా ఉండగలదు. ఇంకా 'బిడ్డ పెళ్ళి' అనే గండం ఎదురయితే కుటుంబం మునిగినట్టే. జంధ్యంతో సహా అగ్రకులాల లక్షణాలు సుమారుగా ఉన్న పద్మశాలీలలో కట్నాలూ ఎక్కువే.

ఈ భారం ఇక మోయలేమనుకున్న వాళ్ళు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కల్తీకల్లుకు బానిసలయి శరీరం బలహీనపడి పనిచేయలేక, సంపాదించలేక ప్రాణం తీసుకుంటున్నారన్న విశ్లేషణ ప్రభుత్వం చేస్తున్నది. మగవాళ్ళు తమ సంపాదనను కల్లు డిపోలకూ బ్రాందీ షాపులకూ అప్పగించడం, స్త్రీలు కష్టం చేసి కుటుంబాలను పోషించడం మన రాష్ట్రంలో పేద వర్గాలలో సర్వత్రా ఉన్నదే. స్త్రీలోక రాజకీయ శక్తి కాలేకపోవడం వల్ల ఇదొక రాజకీయ సమస్య కాలేదు గానీ, అయివుంటే ఇదే ఒక ప్రధాన రాజకీయ సమస్య అయి వుండేది. దీనికి పేదరికంతోనూ, ప్రజలు తాగనిదే ప్రభుత్వం నడవజాలదన్న ఎక్సైజ్ పాలసీతోనూ తప్ప ప్రాంతాలతో, కులాలతో

సంబంధం లేదు. అయితే పేదలలో కొన్ని ప్రత్యేకమైన వర్గాలలో మాత్రమే మగ వాళ్ళు ఆత్మహత్యను పరిష్కారంగా ఆశ్రయించడం జరుగుతున్నప్పుడు దీనిని దానికి కారణంగా చూపించడం అతి తెలివితనం. తాగుడును పెంచడంలో ప్రధానపాత్ర ఉన్న ప్రభుత్వమే ఈ విశ్లేషణ చేయడం సిగ్గుమాలినతనం కూడ.

చంద్రబాబు పాలనలోనే ఆత్మహత్యలు మొదలుకాగా అతను ఎప్పటిలాగే 'అభివృద్ధి'ని దీనికి పరిష్కారంగా చూపించాడు. సిరిసిల్ల దగ్గర టెక్స్టైల్ పార్క్ నెలకొల్పుతామనీ, ఆ తర్వాత నేత కార్మికులకు కావలసినంత పని దొరుకుతుందనీ ప్రకటించాడు. నిజానికి పని దొరకకపోవడం కాదు సమస్య. సిరిసిల్లకు ఇవాళ ఇతర తెలంగాణ జిల్లాల నుండి కూడ కూలీలు వలసపోయి పవర్‌లూంలలో పనిచేస్తున్నారు. జరుగుబాటుకు కావలసిన ఆదాయం లభించకపోవడం సమస్య. పవర్‌లూం కార్మికులకు ప్రభుత్వం నిర్ణయించిన కనీస వేతనంలో కేవలం నాలుగవ వంతు దక్కుతున్నది. నూలు సరఫరా నుండి బట్ట అమ్మకం దాకా సమగ్రమైన మార్పు రానిదే ఈ స్థితి మెరుగుపడడం సాధ్యం కాదు. కాగా, చంద్రబాబు హామీ ఇచ్చిన టెక్స్టైల్ పార్కు రానే వచ్చింది. అయితే ఖరీదయిన ఆటోమేటిక్ లూంలతో పట్టుమని పదిమందికి మాత్రమే పని కల్పించే సంస్థలక్కడ వెలుస్తున్నాయి. ఇది నిరుద్యోగానికీ పరిష్కారం కాదు, పేదరికానికీ కాదు.

కరీంనగర్‌లో ఈ రావూ ఆ రావూ సవాళ్ళూ, ప్రతిసవాళ్లూ విసురుకుంటున్న దశలోనే రాష్ట్రప్రభుత్వం నేత కార్మికుల ఆత్మహత్యల వల్ల దెబ్బతిన్న కుటుంబాలను ఆదుకోవడానికని చెప్పి 119 నెంబరు గల నష్టపరిహారం జీవోను జారీచేసింది. మొదట్లో దానిని రాజశేఖరరెడ్డి హయాంలో జరిగిన ఆత్మహత్యలకే పరిమితం చేసినా, ప్రజలకు ఏదిచ్చినా – సారాయి, కల్లు తప్ప – మితంగానే ఇవ్వాలనీ, లేకపోతే వాళు ్ళ చెడిపోతారనీ నమ్మే అధికార యంత్రాంగం సరిగ్గా సగభాగం ఆత్మహత్యలు జీవో119 పరిధిలోకి రావని తేల్చి ఆ కుటుంబాలకు నష్టపరిహారం తిరస్కరించింది.

25 వేల 'సాంచాలు'న్న సిరిసిల్లలో తెలంగాణ భావన ఈ పరిస్థితితో నిమిత్తం లేకుండ గులాబిరంగు పార్టీకి వోట్లు తెచ్చి పెడుతుందనుకుంటే పొరపాటే. సిరిసిల్లలోనైనా వేరే ఊళ్ళలోనయినా చదువుకున్న వర్గాలు ఇతరత్రా తమ

రాజకీయాలేవయినా ఈసారి తెలంగాణకు వోటేసి తెలంగాణ పరువు కాపాడాలని నిర్ణయించుకున్నట్టు స్పష్టంగానే కనిపిస్తున్నది. కానీ పేదవర్గాల మాట కూడా అదే అవుతుందా? 'ఆ సైకిలోడే మంచోడు. ఒక్కసారయినా మా తానికొచ్చి చూసిపోయిండు, ఈ కారోడు ఒక్కసారి కూడా రాలే'దన్న ఒక మృతకార్మికుడి భార్య అభిశంసన కెసిఆర్ చెవిన పడుతుందా?

*ప్రజాతంత్ర వారపత్రిక*

*12 నవంబర్ 2006*

# 610 జీవో : ఎవర్ని పొమ్మంటుందో ఎందుకు పొమ్మంటుందో అర్థం చేసుకోండి

ప్రజలారా...

జీవో 610 అమలు గురించి జరుగుతున్న రచ్చ మీరందరూ ప్రతిరోజూ దినపత్రికలలో చదువుతున్నారు, టీవిలలో చూస్తున్నారు. మన రాజకీయ నాయకులు మాట్లాడేటప్పుడు ప్రశ్నలు, జవాబులు, తిట్లు, సవాళ్ళు, శాపనార్థాలు, వెక్కిరింతలు అన్నీ ఎంతగా కలగలిసి పోతాయంటే విషయమేమిటో ఎవరికీ అర్థం కాదు.

అయితే ఇది ఉద్యోగ రంగంలో సమాన అవకాశాలు అనే ముఖ్యమైన హక్కుకు సంబంధించిన విషయం కాబట్టి రాష్ట్రంలో అన్ని ప్రాంతాల ప్రజలూ ఈ వివాదంలోని విషయాలను అర్థం చేసుకోవడం అవసరం అని మేము భావిస్తున్నాం.

**ముందు కొన్ని అపోహలు తొలగించుకుంటే మంచిది.**

1. ఉద్యోగాలలో స్థానిక రిజర్వేషన్లు తెలంగాణకు ప్రత్యేకం కాదు. స్థానిక రిజర్వేషన్లు అతిక్రమించబడ్డాయన్న తెలంగాణావారి ఫిర్యాదు మేరకు జీవో 610 జారీ అయినప్పటికీ, ఇందులోని సూత్రం అన్ని ప్రాంతాలకూ వర్తిస్తుంది. చట్టం ప్రకారం స్థానికులను నియమించవలసిన పోస్టులలో స్థానికేతరులను నియమించి ఉంటే వారిని తొలగించి ఆ

ఖాళీని స్థానికులతో నింపాలి అనేది దీని సారాంశం. అటువంటి జీవో ఆంధ్ర ప్రాంతం వాళ్ళూ అడగొచ్చు, పొందవచ్చు.

2. ఎప్పటినుండో తెలంగాణలో ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళను అకస్మాత్తుగా వెళ్ళిపొమ్మనడం లేదు. జీవో 610 డిసెంబర్ 30, 1985 నాడు జారీ అయింది. చట్ట విరుద్ధంగా తెలంగాణ ప్రాంతంలో నియమించబడ్డ స్థానికేతరులను మార్చి 31, 1986లోగా పంపించివేయాలని ఆ జీవో చెప్తుంది. ఆ గడువు దాటి 20 సంవత్సరాలు గడిచాయి. అది అమలు కావలసి ఉంటుందనీ, ఏదో ఒక రోజు అవుతుందనీ ఉద్యోగులకు తెలియకుండా ఉండే అవకాశం లేదు.

3. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలకు చెందిన వాళ్ళందరినీ వెళ్ళిపొమ్మనడం లేదు. స్థానిక రిజర్వేషన్ అంటే నూటికి నూరు శాతం రిజర్వేషన్ కాదు. అటెండర్ నుండి ఎల్.డి.సి. (జూనియర్ అసిస్టెంట్) దాకా ఉన్న కింది స్థాయి ఉద్యోగాలలో 80 శాతం, ఎల్.డి.సి. కంటే ఎక్కువ హోదా ఉన్న ఎన్.జి.ఓ ఉద్యోగాలలో 70 శాతం, గెజిటెడ్ పోస్టులలో 60 శాతం ఉండే రిజర్వేషన్. కిందిస్థాయి పోస్టులకు ఆ జిల్లాకు చెందినవారే స్థానికులు. దాని పైస్థాయి వాటికి రెండు లేక మూడు జిల్లాలతో కూడిన జోన్‌కు చెందినవారు స్థానికులు. ఇంకా పైస్థాయి పోస్టులకు అసలు స్థానిక రిజర్వేషనే వర్తించదు. రిజర్వేషన్ పోను మిగిలిన పోస్టులకు ఎక్కడివారైనా పోటీపడవచ్చు. స్థానికులు కూడా ఈ పోస్టులకు పోటీ పడవచ్చు.

4. ముప్పై ఏళ్ళు హైదరాబాద్‌లో ఉద్యోగం చేసినా ఇంకా స్థానికేతరులనడం అన్యాయం అని ఆవేశపడనక్కరలేదు. స్థానికేతరులు అనేది నింద కాదు, తిట్టు కాదు, బహిష్కరణ కాదు. ఉద్యోగ నియామకంలో స్థానిక రిజర్వేషన్‌కు విరుద్ధంగా నియమించబడ్డ వారని మాత్రమే దాని అర్థం. నియామకంలోనే జరిగిన ఆ లోపం ఎన్ని సంవత్సరాలు పనిచేసినా పోదు కదా! అయినా సరే అక్రమంగా నియమించబడ్డ వాళ్ళ ఉద్యోగాలేమీ తీసేయరు. వారికోసం అదనపు పోస్టులు ('సూపర్ న్యూమరరీ' అని ఇంగ్లీషులో అంటారు) కల్పిస్తారు. అయితే అది వారి జిల్లాలో, లేక జోన్‌లో ఉంటుంది. అలాగని వారి కుటుంబ సభ్యులందరూ స్థానిక ఉద్యోగాలకు అనర్హులేమీ కారు. నిజానికి 20, 30 ఏళ్ళు కాదు అంతకంటే చాలా తక్కువ కాలం ఒక జిల్లాలో ఉన్న ఉద్యోగుల పిల్లలు ఆ జిల్లాకు స్థానికులు అయిపోగలరు. ఒక ఉద్యోగానికి

ఉండే విద్యార్హతకు సంబంధించిన చివరి సంవత్సరంతో లెక్కగట్టి నాలుగు సంవత్సరాలు అక్కడ చదువుకుని ఉంటే చాలు, వాళ్ళు స్థానికులే.

అపోహలు అటుంచి, అసలు జీవో 610 ఎందుకొచ్చిందో తెలుసుకోవడం అవసరం. తెలంగాణవాసులు దాని అమలు గురించి ఎందుకు ఆవేశపడుతున్నారో తెలుసుకోవడం అవసరం. 'విశాలాంధ్ర' ఏర్పాటు పట్ల తెలంగాణ వాసులు తొలి నుండి విముఖంగా ఉండడానికి గల ఒక ముఖ్య కారణం – విద్య విషయంలో తెలంగాణ వెనకబడి ఉండడం. ఆధునిక పాలనా యంత్రాంగంలోనూ, ఆర్థిక రంగంలోనూ ఉద్యోగాలు పొందాలంటే బ్రిటిష్ వాడు ప్రవేశపెట్టిన నమూనాలో విద్యావంతులై ఉండాలి. అందుకే దేశవ్యాప్తంగా బ్రిటిష్ పాలిత ప్రాంతాలు స్థానిక సంస్థానాల కింద ఉన్న ప్రాంతాల కంటే స్వాతంత్ర్యం వచ్చేనాటికి విద్యా, ఉద్యోగ విషయాలలో ముందు ఉన్నాయి. (బ్రిటిష్ నమూనాను ముందు నుండి పెంపొందించిన సంస్థానాలను మిహాయించి). చాలా విషయాలలో తెలంగాణ కంటే వెనుకబడి ఉన్న రాయలసీమ కూడా 'విశాలాంధ్ర' ఏర్పడే నాటికి విద్య విషయంలో మాత్రం తెలంగాణ కంటే ముందు ఉంది. అభివృద్ధిలో విద్యకుండే ప్రాముఖ్యాన్ని దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఈ అసమానత అసమాన అభివృద్ధికి దారితీయగలదన్న ఆందోళన రాష్ట్రావతరణ నాటి నుండి వ్యక్తం అయింది. మొదటి ఎస్.ఆర్.సి నివేదికలోను, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ముందుషరతు అయిన పెద్దమనుషుల ఒప్పందంలోనూ ఇది స్పష్టంగా కనిపిస్తుంది. రాష్ట్రావతరణ తరువాత విద్యా ఉద్యోగ రంగాలలో ఉన్న ఈ అసమానతను తగ్గించడానికి సంకల్పపూర్వకమైన ప్రయత్నం జరిగి ఉంటే సమస్య క్రమంగానైనా పరిష్కారం అయ్యేదేమో గానీ అటువంటిదేమీ జరగలేదు. అప్పటికే అభివృద్ధి చెందినవారు అందినకాడికి అవకాశాలు వాడుకొని ఇంకింత అభివృద్ధి చెందాలన్నదే లక్ష్యంగా ఉండింది, ఉంది.

ఈ స్థితిలో విద్యా ఉద్యోగ రంగాలలో తెలంగాణ ప్రాంత ప్రజల హక్కులను కాపాడగలిగింది 'ముల్కీ' నిబంధనలొక్కటే. ముల్క్ అంటే ప్రదేశం అని అర్థం. ముల్కీ అంటే ప్రాదేశికులు. 12 సంవత్సరాలు హైదరాబాద్ రాష్ట్రవాసులై ఉంటేనే ఉద్యోగ నియామకం విషయంలో స్థానికులుగా పరిగణించబడతారన్న నియమం హైదరాబాద్ సంస్థానంలో ఉండింది. అయితే హైదరాబాద్ నిజాము లొంగిపోయిన మరుసటి రోజు నుండి దీనిని అతిక్రమించి అప్పటి మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాల వాసులను యథేచ్ఛగా హైదరాబాద్‌లో నియమించసాగారు.

1969లో మొదలైన మొదటి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం లేవదీసిన ముఖ్యమైన ప్రశ్నలలో ముల్కీ నిబంధనల ఉల్లంఘన ఒకటి. పైన చెప్పినట్టు, ఇదేదో ఒక ప్రత్యేకహోదాను కోల్పోయారన్న దుగ్ధ కాదు. విద్యా ఉద్యోగరంగాలలో సమాన అవకాశాలు దక్కలేదన్న ఆవేదన. తెలంగాణను కలుపుకున్న ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ముందుషరతుగా ప్రకటించుకున్న పెద్దమనుషుల ఒప్పందంలో సమాన అవకాశాలు ఉండాలన్న దృష్టితోనే ముల్కీ నిబంధనలు కొనసాగాలని రాసుకున్నారు. ఆంధ్ర రాయలసీమ ప్రాంత నాయకులు ఒప్పుకున్నారు కూడా. కానీ తెలంగాణ ఉద్యమం ముల్కీ నిబంధనలు సక్రమంగా అమలుకాలేదన్న అభ్యంతరం లేవదీయగానే ఆ నిబంధనలే రాజ్యాంగ విరుద్ధం అని హైకోర్టులో కేసు వేయడం, హైకోర్టు అవి రాజ్యాంగ విరుద్ధమేనని ప్రకటించడం జరిగింది. దీనితో సమాన విద్యా ఉద్యోగ అవకాశాలు శాశ్వతంగా సమాధి అయ్యేవేమోగానీ 1977లో సుప్రీంకోర్టు హైకోర్టు తీర్పును కొట్టేసి ముల్కీ నిబంధనలు రాజ్యాంగబద్ధమేనని తీర్పు ఇచ్చింది.

రాజకీయంగానూ అంగీకరించి సుప్రీంకోర్టు ఆమోదముద్ర వేసిన ఈ సమానతా సూత్రాన్ని తెలంగాణేతరులు గౌరవించి ఉంటే రాష్ట్రంలో పరిస్థితి అన్ని రకాలుగా మెరుగుగా ఉండేది. కానీ దానిని గౌరవించకపోగా వారు బ్లాక్‌మెయిల్‌కు దిగారు. అప్పటికే తెలంగాణ ఉద్యమం నాయకత్వపు బలహీనత వల్ల చల్లారిపోయిన విషయాన్ని అలుసుగా తీసుకొని ముల్కీ నిబంధనలతో సహా తెలంగాణ ప్రాంతానికి ఏ ప్రత్యేక ప్రతిపత్తీ, రక్షణా ఉండడానికి వీలులేదనీ, అన్నీ తొలగించకపోతే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఇచ్చేయాలనీ డిమాండు చేస్తూ 'జై ఆంధ్ర' ఉద్యమం లేవదీశారు. (ఈ రోజు కూడా జీవో 610ని సంపూర్ణంగా అమలుచేయాలని పట్టుబట్టినట్టయితే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోరుకుంటామని ఆంధ్ర ప్రాంత నాయకులుగా చలామణి అవుతున్నవారు అంటున్నారు. విద్యా, ఉద్యోగ రంగాలలో చారిత్రక కారణాలవల్ల సంక్రమించిన ఆధిపత్యాన్ని శాశ్వతంగా కొనసాగించాలన్న ఆరాటం తప్ప ఈ దబాయింపులో న్యాయం ఏమైనా ఉందా?)

సుప్రీంకోర్టు ముల్కీ నిబంధనలు రాజ్యాంగబద్ధమేనని ప్రకటించినప్పటికీ ఈ దబాయింపుకు లొంగి వాటిని రద్దుచేసి వాటి స్థానంలో జీవో 610కి మూలమైన రాష్ట్రపతి ఆదేశాలు జారీచేశారు. వాటిని మళ్ళీ న్యాయ వివాదాలలోకి లాగకుండా ఉ ండగలందుకు రాజ్యాంగాన్ని సవరించి, ఆర్టికల్–371 డి ని ప్రవేశపెట్టి ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలను నివారించడానికి ప్రత్యేక ఆదేశాలు జారీచేసే అధికారం

రాష్ట్రపతికి (అంటే కేంద్ర ప్రభుత్వానికి అని అర్థం) ఇచ్చారు. దానిననుసరించి 1975లో జారీ చేసిన రాష్ట్రపతి ఆదేశంలో ఒక్క తెలంగాణలోనే కాక రాష్ట్రమంతటా కూడా ఉద్యోగాలలో స్థానికులకు రిజర్వేషన్‌లు కల్పించారు. ఈ స్థానిక రిజర్వేషన్ అన్ని ప్రాంతాలలోనూ ఒకేరకంగా అమలవుతుంది. అందులో తెలంగాణకు ప్రత్యేక ప్రతిపత్తి ఉందన్న అభిప్రాయం అపోహ అని మొదట్లోనే చెప్పాము. ఈ రోజు విజయనగరం జిల్లాలోనూ, చిత్తూరు జిల్లాలోనూ అన్ని ప్రభుత్వ కార్యాలయాలలోనూ అటెండర్ పోస్టుల నుండి ఎల్.డి.సి. పోస్టులదాకా నూటికి 80 శాతం ఆ జిల్లావారే ఉన్నారంటే అది తెలంగాణ ఉద్యమం చలవే. లేకపోతే ఆ జిల్లాలలో కిందిస్థాయి పోస్టులు సైతం బయటివాళ్ళు తీసుకుందురనడంలో సందేహమేమీ లేదు.

అయితే 1975లో జారీ అయిన ఈ ఆదేశం కొన్నిచోట్ల సక్రమంగా అమలు కాలేదు. ముఖ్యంగా రాజధానిలో బతకడంలో ఉన్న ఇతర ఆకర్షణల కారణంగా హైదరాబాద్‌లో దాని ఉల్లంఘన పెద్దెత్తున జరిగింది. దీనికి వ్యతిరేకంగా 1980లలో ఆందోళన జరిగింది. టి.జి. వెంకటేశ్ గారికి తెలియకపోవచ్చును గానీ అక్రమంగా నియమించబడ్డ స్థానికేతరులను పంపించేయాలన్న ఆందోళన రాయలసీమలోనే మొదట జరిగింది. దానికి స్పందించి రాష్ట్ర ప్రభుత్వం జీవో 564ను జారీచేసింది. అది చాలావరకు అమలయింది కూడా. అలాగే అంతకంటే పెద్ద సంఖ్యలో – ప్రధానంగా హైదరాబాద్‌లో జరిగిన అక్రమ నియామకాలకు వ్యతిరేకంగా తెలంగాణవాసులు లేవదీసిన ఆందోళనకు జవాబుగా 1985లో జీవో 610 జారీ అయింది. అయితే అది 20 సంవత్సరాలైనా అమలు కాకపోవడం వల్ల రెండవసారి పెల్లుబికిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం దానికోసం పట్టుబడుతున్నది.

ఇందులో అన్యాయం ఏముంది? అభ్యంతరం చెప్పడానికి ఏముంది? విద్యా, ఉద్యోగ రంగాలలో సమాన అవకాశాలు ఉండనక్కరలేదనుకునే వాళ్ళతో మాట్లాడేదేమీ లేదు. ఉండాలనుకునే వాళ్ళు తెలంగాణేతర ప్రాంతాల ప్రతినిధులుగా చలామణి అవుతున్న రాజకీయ నాయకులు చేస్తున్న రచ్చను మౌనంగా ఎందుకు స్వీకరిస్తున్నారు?

*మానవహక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది.*
*25 జూన్ 2007*

# ప్రతిపక్షాలకు గుణపాఠం...!

ఈ ఎన్నికలలో అత్యధికంగా పరువు పోగొట్టుకున్నది కల్వకుంట్ల చంద్రశేఖరరావా, బి.వి. రాఘవులా అంటే తేల్చి చెప్పడం కష్టం. చంద్రబాబునాయుడు ఓడిపోయినా పరువు నిలబెట్టుకున్నాడు. నారాయణకు పోగొట్టుకోవడానికి పరువు లేదు. చిరంజీవి రాజకీయాలకింకా కొత్త కాబట్టి అతని పరువు గురించి ఎవరూ అనుకోవడం లేదు. పూర్తిగా పరువు పోగొట్టుకున్నది ఈ ఇద్దరే. ఎవరెక్కువ అనే తూకం మాత్రం కష్టం.

ఎన్నికలలో ఏర్పాటు చేసుకునే కూటములకు సిద్ధాంతం వర్తించదన్న నిర్ణయానికి సిపిఐ(ఎం) ఎప్పుడో వచ్చింది. సిద్ధాంతరీత్యానే ఆ నిర్ణయానికొచ్చారు కాబట్టి సిద్ధాంత రాహిత్యాన్ని ఆచరించడంలో వేరెవ్వరికీ సాధ్యం కానంతగా దిగజారగలరు. వట్టి అవకాశవాది ఎక్కడో ఒకచోట ఆగుతాడు. సైద్ధాంతిక అవకాశవాదం హద్దులెరుగదు. ప్రతీ ఎన్నికలోనూ పిడికెడు సీట్లు పొందాలి, వాటిని కాపాడుకోవాలి. దానికోసం ఎన్ని పల్టీలయినా కొట్టవచ్చు. నిన్నటిదాకా అలసట లేకుండా తిట్టినవాడితో ఇవాళ కలిసి తిరగవచ్చు, ఇవాళ తిడుతున్న వాడితో రేపు కలిసి తిరగవచ్చు. ఈ కలిసి తిరగడం కేవలం సీట్ల సర్దుబాటు దగ్గర ఆగిపోనక్కరలేదు. పూర్తి స్థాయిలో వాడి పైత్యాన్నంతా మీద వేసుకొని

శభాష్ అంటూ తిరగొచ్చు. వాడు ఇంటింటికీ కలర్ టీవీలు ఇస్తానంటే ఇవ్వడానికి అంతకంటే అవసరమయిన వస్తువేదీ లేదా అని అడగకూడదు. పోనీ తటస్థంగానూ ఉండకూడదు. అది చాలా గొప్ప ఆలోచన అని పొగడాలి. వాడు అందరికీ నెలకు వెయ్యి నుండి రెండువేల దాకా ఉచిత వేతనం ఇస్తానంటే దానికి బదులు అందరికీ పని కల్పించే ఆలోచన చేయరాదా అని అడగకూడదు. పోనీ ఊరకుండనూ కూడదు. అది విప్లవాత్మకమైన ఆలోచన అని పొగడాలి.

బి.వి. రాఘవులు రాష్ట్ర సిపిఐ(ఎం) కార్యదర్శి అయి పడక కుర్చీ స్టాలినిస్టుల పార్టీగా ఉన్నదానిని వీధులలోకి ఈడ్చి ధర్నాలూ రాస్తారోకోలు చేయించినప్పుడు సిపిఐ (ఎం) రాజకీయాలతో ఏకీభావం లేనివాళ్ళం సహితం సంతోషించాం. ఇన్నాళ్ళకు ఎర్రజెండా ఎక్కడుండాలో అక్కడికి వచ్చి చేరిందని భావించాం. అయితే ఇదంతా ఆ 'పిడికెడు సీట్లు పొందడం, కాపాడుకోవడం' అనే వ్యూహంలో భాగమేనని అర్థం కావడానికి కొంతకాలం పట్టింది. విధ్వంసకరమైన అభివృద్ధి విధానాలను రాష్ట్రంపైన రుద్దుతున్న రాజశేఖరరెడ్డి పాలన వల్ల జీవనం కోల్పోతున్నవారిని సంఘటితపరచి ఆ విధ్వంసాన్ని ఎదుర్కొనడం తమ పునాది రాజకీయ కర్తవ్యంగా ఎంచుకొని పనిచేసి, ఎన్నికలొచ్చినప్పుడు ఆ ప్రాతిపదికన పోటీచేయడం, దానికి తగిన కూటములు ఏర్పాటుచేసుకోవడం గౌరవించదగ్గ రాజకీయ ఆచరణ అయి ఉండేది. దానిని ఆచరించి ఒక సీటూ గెలవకపోయినా, ఉద్యమ ఆత్మగౌరవాన్ని తాకట్టు పెట్టి ఒక సీటు గెలుచుకున్నా వచ్చే తేడా ఏమిటో సాధారణ తెలివితేటలున్న వారికి అర్థం కావడం కష్టం.

రెండేళ్ళుగా రాష్ట్రంలో వామపక్ష పార్టీలు భూపోరాటాలు భీకరంగా నిర్వహించినట్టు టీవీలలో చూసాము. నారాయణయితే నేలమీద సంచరిస్తే పోలీసులు ఆపేస్తారని చెప్పి పడవ మీద పయనించి పోరాట ప్రాంతంలో ఉన్న టీవీ కెమెరాలను చేరుకున్నాడు. ఇప్పుడు వారిరువురూ వెనక్కి తిరిగి చూసుకొని ఆనాడు పాతిన జెండాలు, ఆక్రమించుకున్న భూములు ఇప్పుడేమయ్యాయో, ఎక్కడున్నాయో తెలియజేసే నివేదిక ప్రజలకు సమర్పిస్తారా? భూమి పోరాటం సీరియస్‌గా చేయదలచుకుంటే హక్కు పొందగల భూమిని ఎంపిక చేయాలి, హక్కు పొందడం కోసం చట్టపరమైన చర్యలనూ పోరాట చర్యలనూ తగిన పద్ధతిలో మేళవించాలి, చివరిదాకా అడుగడుగూ పోరాటాన్ని నడిపించాలి. ఇది వామపక్షాలకు తెలియందీ కాదు, గతంలో వారు

సహితం చేయందీ కాదు. కానీ ఎన్నికల దృష్టితో చేసే 'షో'కు భూమి పోరాటాలను కుదించే రోజులు వచ్చాయి కాబట్టి తెలిసింది కూడా మరచిపోయారని భావించి పాఠాలు చెప్పవలసి వస్తున్నది.

చంద్రశేఖరరావుకు ఇంతటి పాఠాలు చెప్పేది కూడా ఏమీ లేదు. అసాధారణ రాజకీయ చైతన్యానికి నెలవయిన తెలంగాణ– దొరతనపు లక్షణాలను ఆవగింజంత కూడా వదులుకోని ఈ వ్యక్తిని నమ్ముకోవడమే పెద్ద పొరపాటు. పోరాటాల, ఉద్యమాల గురించి చాలా తెలిసిన తెలంగాణ ఆ అవగాహన నుండి నిరాశనే నేర్చుకొని ఇతని రాజకీయ చాతుర్యం మీద నమ్మకం పెట్టుకోవడం ట్రాజెడీ. కాంగ్రెస్ వారు భారత రాజకీయాలకు నేర్పించిన చాణక్యం ముందు ఈ దొరవారి చాతుర్యం ఏపాటిది? ఇప్పుడింక అయిదేళ్ళ పాటు తెలంగాణ రాష్ట్రం గురించి మాట్లాడేది ఉండదని అందరూ అంటున్నారు. రాజశేఖరరెడ్డి రాష్ట్రంలో స్వంతంగా గెలిచాడు. కేంద్రానికి పెద్దసంఖ్యలో ఎం.పి.లను పంపించి అక్కడ తన మాట నెగ్గేటట్టు చూసుకున్నాడు. వేరొకరయితే గెలుపులో కొంత ఔదార్యాన్ని ప్రదర్శిస్తారని ఆశించవచ్చు. సాధారణ మానవులలో ఆ గుణం ఉంటుంది. కానీ ఫాక్షనిస్టు నైజం అది కాదు. ఫాక్షనిస్టు ఓడిపోయినవాడిని మళ్ళీ లేవకుండా తొక్కేస్తాడు. కాళ్ళు నరికి కిందపడేసిన వాడిని బతికి పోనీ లెమ్మని వెళ్ళిపోడు. మెడ నరికి చంపేసి పోతాడు.

తెలంగాణ రాష్ట్రం గురించి పార్లమెంటులో, అసెంబ్లీలో ఇప్పట్లో ఇంక మాట్లాడేది ఏమీ ఉండకపోవచ్చునేమో గానీ తెలంగాణ గురించీ, తెలంగాణ కోసమూ మాట్లాడేదీ చేసేదీ చాలానే ఉంది, ఉంటుంది. తెలంగాణ ప్రజల హక్కులనూ అవసరాలనూ కాపాడడానికి ఉద్యమాలు నడపడం నిష్ప్రయోజనమనీ ప్రత్యేక రాష్ట్రం వచ్చినప్పుడు అవే ఒనగూడుతాయనీ వాదించే వైఖరి ఇప్పటిదాకా తెలంగాణవాదులలో ఉంది. అది చేయవలసిన నష్టం చేసింది. కొన్నింటిని ఇప్పుడు ఆపకపోతే రాష్ట్రం సాధించుకున్న తరువాత ఆపే అవకాశం, వెనక్కి తిప్పే అవకాశం ఉండదు. పోలవరం ప్రాజెక్టు కట్టేసుకోవడం జరిగిపోయినట్టయితే మునిగిన గ్రామాలు మళ్ళీ పైకి వస్తాయా, స్థిరపడిపోయిన నీటి హక్కులు పోతాయా? లక్షల ఎకరాల భూమిని బొందలుగా మారుస్తున్న సింగరేణి ఓపెన్ కాస్ట్ ప్రాజెక్టులన్నీ నెలకొనిపోయిన తరువాత ఆ బొందలు పూడుతాయా, తిరిగి అక్కడ జీవితాలు మొలుస్తాయా? కృష్ణానది మిగులు జలాల మీద రాయలసీమకు అసలే హక్కు ఇవ్వడానికి వీలు

లేదనీ, తెలంగాణ రాష్ట్రం వస్తే అంతా దక్షిణ తెలంగాణకే చెందేటట్టు చూస్తామనీ వాదిస్తూ – ప్రస్తుతం ఉభయ ప్రాంతాలలో అమలవుతున్న మిగులు జలాల ప్రాజెక్టుల విషయంలో రాజశేఖరరెడ్డి ఏకపక్షంగా వ్యవహరిస్తున్న తీరును వ్యతిరేకించడానికి ఏ రాజకీయ కార్యక్రమం తీసుకోకపోతే, సమానంగా చెందవలసిన నీటి హక్కులు అసమానంగా వ్యవస్థితమయిపోయిన తరువాత ఏం చేయగలుగుతారు?

మొత్తంగా దేశ పాలనా విధానాలకు చెందిన అప్రజాస్వామిక అంశాలను తెలంగాణకు ప్రత్యేకమైన విషయాలుగా భావించి వాటిమీద సూత్రబద్ధమైన పోరాటాలు చేయకుండా తెలంగాణ కోసం ఆగడం కూడా నష్టం చేసింది. ఉదాహరణకు సెజ్‌ల కోసం, భారీ పారిశ్రామీకరణ కోసం జరుగుతున్న బలవంతపు భూసేకరణను తెలంగాణ వనరుల దోపిడీ కింద జమకట్టడం తెలంగాణవాదులకు పరిపాటి అయింది. నిజానికి తెలంగాణలో ఒక్క రంగారెడ్డి జిల్లాలో మాత్రమే ఇది జరుగుతుండగా కోస్తాంధ్రలో ప్రతి జిల్లాలోనూ జరుగుతున్నది. నెల్లూరు, విశాఖపట్నం జిల్లాలు విడివిడిగా రంగారెడ్డితో పోటీకి రాగలవు. దీనిమీద జరగవలసిన సూత్రబద్ధమైన పోరాటానికీ, తెలంగాణ రాష్ట్ర సాధనావకాశాలకూ ఏమీ సంబంధం లేదు.

తెలంగాణలోని ప్రజాతంత్రవాదులూ ఉద్యమకారులూ ఈ విషయాలను సులభంగానే అర్థం చేసుకోగలరు. తెరాస రాజకీయతంత్రం కల్పించిన నిద్ర నుండి మేల్కొని ఉద్యమ వ్యూహరచన చేసుకోగలిగితే ఈ ఓటమీ మంచికేనని భావించవచ్చు.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*17 మే 2009*

# గొంతెత్తిన పాలమూరు

ఇప్పుడు పరిస్థితి కొంచెం మారిందేమో గానీ ఈ ప్రచురణలోని కరపత్రాలు అచ్చువేసిన రోజులలో మహబూబ్‌నగర్ జిల్లాలో ఏడవ నెంబర్ జాతీయ రహదారిని మినహాయించి వేరే ఏ రోడ్డుపైన ప్రయాణం చేసినా, ఒక అర్ధగంట గడిచేటప్పటికి ఈ ప్రపంచంలో మనమూ నాలుగు మేకలూ తప్ప వేరెవరూ లేరన్న అనుభూతి కలిగేది. ఈ క్షణం ప్రళయం వచ్చి తక్కిన ప్రపంచమంతా మునిగిపోయినా మనకసలు తెలియదేమో అనిపించేది. సాయంత్రమయితే, స్కూటర్ వెనక కూర్చున్న మనిషి భయస్తుడయితే 'ఇవాళ్టికి ఆగుదాం లెండి, రేపు పోదాం' అనడం, పిరికితనం అనుకుంటారన్న భయం లేకపోతే మనమూ అదే హితం అనుకోవడం జరిగేది.

వెనుకబాటుతనానికి శాస్త్రీయ సూచికలు అనేకం ఉంటాయి. శాస్త్రీయ విశ్లేషణకు అవి అవసరమే, సందేహం లేదు. కాని ఒక ప్రాంతపు వెనుకబాటుతనాన్ని అనుభూతి చెందడానికి ఆ సూచికలు, వాటిని ఆధారం చేసుకున్న నివేదికలు అవసరం లేదు. నిర్మానుష్యమైన బయలు ప్రదేశాలు, కంపచెట్లు తప్ప మరొక వృక్షజాతి సృష్టిలో లేదనిపించే బీడు భూములు, తెల్లబట్టలవాళ్ళు మంచివాళ్ళే అయి ఉంటారని విశ్వసించే

అమాయకపు చూపులు, ప్రభుత్వం ఏ కొంచెం చేసినా అదే పదివేలు అనుకునే అల్పసంతోషం – గురి తప్పకుండా అది వెనుకబడిన ప్రాంతం అని సూచిస్తాయి.

అభివృద్ధి వికృతరూపం తీసుకుంటున్న ఈ రోజులలో వెనుకబాటుతనాన్ని గురించి ఆందోళన వ్యక్తం చేసే ముందు కొంచెం సంజాయిషీ అవసరం. ప్రకృతిని ధ్వంసం చేయకుండా, మనుషులకు దానిని దూరం చేయకుండా, దాని ఫలసాయాన్ని పెంచే చర్యలు అభిలషించదగ్గ అభివృద్ధే. పొలాలకు నీటివసతి కల్పించడం, భూసారాన్ని కాపాడడం, బంజర్లలోనూ, అడవులలోనూ జీవనానికి ఉపయోగపడే వనరులను పెంపొందించడం, వ్యవసాయానికి అనుబంధమైన పశుపోషణకు ఊతమివ్వడం ఈ కోవలోకి వస్తాయి. పిల్లలకు చదువు, అందరికీ ఆరోగ్యం, నివాసం, రవాణా సదుపాయాలు, స్థానిక మార్కెట్ల అభివృద్ధి, రోగ నివారణకు అవసరమైన పారిశుధ్యం కూడా కాంక్షనీయమైన అభివృద్ధి కిందికే వస్తాయి. వ్యవసాయాన్నీ గ్రామీణ జీవిత వనరులనూ అభివృద్ధి చేస్తూ, అవి ఇముడ్చుకోలేని జనాభాకు ప్రత్యామ్నాయ జీవనాధారం కల్పించే పారిశ్రామీకరణ కూడా వాంఛనీయమైన అభివృద్ధే.

ఇటువంటి అభివృద్ధిని ఒక హక్కుగా గుర్తించి, అది అందని జిల్లాలలో ఒకటయిన మహబూబ్‌నగర్‌ను కార్యక్షేత్రంగా ఎంచుకొని కరువు వ్యతిరేక పోరాట కమిటీ చేపట్టిన ఆందోళనలకు అచ్చులోని ప్రత్యక్ష సాక్ష్యాలు ఈ కరపత్రాలు. కమిటీ ఎన్ని ఊర్లు తిరిగింది, ఎన్ని మారుమూల ప్రాంతాలలో ధర్నాలు నిర్వహించింది, కరువుకు గల ఎన్ని కారణాలను వెలికితీసి ప్రపంచం ముందు పెట్టింది, ఏ పరిష్కారాలను డిమాండ్లుగా ప్రభుత్వం ముందు పెట్టింది – ఈ కరపత్రాలు వ్యక్తం చేస్తాయి.

వెనుకబాటుతనం బహుముఖం కాగా ఒక్క నీటిలేమి గురించే ఇంత చర్చ ఎందుకు, ఆందోళన ఎందుకు అన్న సందేహం కలగవచ్చు. కారణాలు చాలా ఉన్నాయి. కరువు లేకుంటే, నీటి లభ్యత తగినంత ఉంటే ప్రభుత్వం ప్రత్యేకించి అభివృద్ధి చర్యలు చేపట్టకపోయినా కొంత అభివృద్ధి దానంతటదే వస్తుంది. వ్యవసాయ ఫలాల మిగులు కొంతమేరకయినా ఇతర రంగాలలోకి పోయి విభిన్న అవసరాలు తీర్చడానికి అవసరమైన మూలధనాన్ని కల్పిస్తుంది. ఈ అభివృద్ధి మార్కెట్ ఆధారితం కాబట్టి దీనిని అందరూ అందుకోలేరనేది సత్యమే. అయితే నీటిలేమి ఉన్నచోట ఆ మేరకు

కూడా అభివృద్ధి ఉండదు. రెండవది, వెనుకబాటుతనంలోని ఇతర లక్షణాలు ఎదుగుదలకు ఆటంకమే గానీ వాటంతటవే ప్రాణాంతకం కాదు. ఆకలి చావులు, బలవంతపు వలసలు, తీవ్ర పౌష్టికాహారలోపం, పిల్లలలో కుంటుపడే ఎదుగుదల – ఇవన్నీ కరువు వికృత ఫలితాలే. అందువల్ల నీటి ఎద్దడి మీద ఎక్కువ దృష్టి పెట్టడం సహజం. మహబూబ్‌నగర్‌కు సంబంధించినంతవరకు ఈ నీటి ఎద్దడికి రెండు కారణాలున్నాయి. ఒకటి, పరిమితమైన వర్షపాతం ఇచ్చే నీటిని జాగ్రత్త చేయగల నీటివనరులను ఘోరంగా నిర్లక్ష్యం చేయడం. రెండు – జిల్లా మధ్యభాగాన, అంచున ప్రవహించే కృష్ణ, తుంగభద్ర నదుల జలాలలో ఈ జిల్లాకు ఉచితమైన వాటా కల్పించకపోవడం. ఇందులో మొదటిదాని కంటే రెండవదాని పైననే కరువు వ్యతిరేక పోరాట కమిటీ ఎక్కువ దృష్టి పెట్టిన విషయం ఈ ప్రచురణలోని కరపత్రాలు చదివితే అర్థం అవుతుంది. తమకు అందవలసిన నీటి వనరును వేరే ఎవరో తీసుకుపోతున్నారన్న ఆవేదన, ఇతర నీటి వనరులను అభివృద్ధి చేయడం లేదన్న ఆందోళన కంటే ఎక్కువ ఉండడం సహజమే. కొత్త ప్రాజెక్టుల మంజూరీ సంగతి అటుంచి, కట్టిన వాటి నిర్వహణ, మంజూరయిన వాటి నిర్మాణం కూడా అలక్ష్యం పాలయ్యాయి. రాష్ట్రంలో స్వాతంత్ర్యానికి పూర్వం కట్టిన ఆనకట్టలు బలహీనమయిపోయాయని ఒక్కొక్కటీ బాగు చేసుకుంటూ వచ్చారు. కృష్ణ, గోదావరి డెల్టాల ఆనకట్టలను పటిష్టం చేసారు. ఆ తరువాత కె.సి.కెనాల్‌నూ చేసారు కానీ ఆ వరుసలో తదుపరి రావలసిన రాజోలిబండ డైవర్షన్ స్కీం (ఆర్.డి.ఎస్) గురించి ఆనాడే కాదు, 2004లో 'జలయజ్ఞం' మొదలుపెట్టినప్పుడు సహితం ఆలోచించలేదు. నాలుగు సంవత్సరాల 'జలయజ్ఞం' తరువాత గానీ ఆర్.డి.ఎస్ ఆధునీకరణ రాష్ట్ర ప్రభుత్వ ఎజెండాలోకి ఎక్కలేదు. బచావత్ అవార్డు ద్వారా రాష్ట్రానికి మంజూరయిన ఏకైక కొత్త ప్రాజెక్టు జూరాల కాగా, దాని నిర్మాణం చాలా తీరికగా చేపట్టారు, ఇప్పటికీ పూర్తి స్థాయిలో చేయలేదు. కాలవల ఆధునీకరణ ద్వారా నీళ్లు ఆదా చేసామంటూ పులిచింతల శ్రీశైలం కుడిగట్టు కాలవ, బీమా ప్రాజెక్టులకు కేంద్ర జలవనరుల సంఘం ఆమోదం పొందారు. శ్రీశైలం కుడిగట్టు కాలవను పూర్తిచేసారు. పులిచింతలను కూడా తెలంగాణ అభ్యంతరాల నడుమ దాదాపు పూర్తి చేసేసారు గానీ బీమా మాత్రం నత్తనడక నడుస్తున్నది. ఈ స్థితిలో నీటి ఎద్దడి గురించి చేసే ఆందోళనలో నదీ జలాల ప్రాజెక్టుల ప్రస్తావన ప్రధాన స్థానంలో ఉండడం సహజం.

కల్వకుర్తి ఎత్తిపోతల పథకం ప్రస్తావన ఆనాటి కరపత్రాలలో తరచుగా కనిపిస్తుంది. అది ఈ రోజు వాస్తవరూపం తీసుకున్నది. దానితోపాటు నెట్టెంపాడు ఎత్తిపోతల పథకం కూడా నిర్మాణం అవుతున్నది. అయితే ఆనాడు వీటికోసం ఆందోళన చేసిన వారికి ఇది పూర్తి సంతృప్తినివ్వదు. ఎందుకంటే రెండూ మిగులు జలాల ప్రాజెక్టులుగానే కడుతున్నారు. అంతేకాదు. ఈ రెండు ప్రాజెక్టులతో సహా కృష్ణా జలాలపైన నిర్మిస్తున్న ఏ మిగుల జలాల ప్రాజెక్టుకూ నీటిహక్కు అడగబోమని రాష్ట్ర ప్రభుత్వం రెండవ కృష్ణా నదీజలాల ట్రిబ్యునల్‌కు హామీ ఇచ్చి వచ్చింది కూడా.

అయినా ఏం ఫరవాలేదని ప్రభుత్వం అంటుంది. దీనికోసం తాను తెలివయిన పథకం రచించినట్టు భావిస్తున్నది. మన రాష్ట్ర వాటా అయిన కృష్ణా నది నికర జలాలలో 200 టి.ఎం.సిలు కర్ణాటక నుండి వస్తాయి. 200 టి.ఎం.సిలు గోదావరి నుండి కృష్ణా బేసిన్‌కు తీసుకొచ్చి (80 ప్రకాశం బ్యారేజికి, 120 నాగార్జునసాగర్ టెయిల్‌పాండ్‌కు), కర్ణాటక నుండి కృష్ణానది ద్వారా వచ్చే 200 టి.ఎం.సిలను నాగార్జునసాగర్‌కు ఎగువనే ఆపేసుకొని కృష్ణానదీ మిగులు జలాల ప్రాజెక్టులకు నికరజలాలు ఇయ్యవచ్చుననేది ఈ పథకం. వాస్తవాలు ఇంత సరళంగా ఉన్నట్టయితే నిజంగానే ఇది తెలివయిన పథకమే. కర్ణాటక నుండి వచ్చే నీళ్ళు మొదట మహబూబ్‌నగర్ జిల్లాలోకి ప్రవేశిస్తాయి కాబట్టి ఈ పథకం వల్ల ఈ జిల్లాకే మొదటి ప్రయోజనం కూడా. కానీ ఇందులో రెండు సమస్యలున్నాయి. గోదావరిలో నీళ్ళు సాపేక్షంగా ఎక్కువ ఉన్నట్లనిపిస్తుంది గానీ గోదావరి పరీవాహక మట్టానికీ ఆ నది నీటిపైన ఆధారపడిన ఉత్తర తెలంగాణ భూముల మట్టానికీ మధ్యనున్న గణనీయమైన తేడా వల్ల ఆ నదీజలాలలో మన రాష్ట్ర వాటా పూర్తిగా వినియోగించుకోవడం చాలా ఖర్చుతో కూడిన విషయం. వినియోగించుకోగల మేరకు ఉత్తర తెలంగాణ జిల్లాల అవసరాలకు ప్రాముఖ్యం ఇవ్వాలే తప్ప కృష్ణా బేసిన్‌కు తరలించుకుపోవద్దన్న వాదన కొట్టిపారేయగలిగింది కాదు. రెండవది, గోదావరి బేసిన్ జలాలను ఆంధ్రప్రదేశ్ కృష్ణా బేసిన్‌కు తరలించినట్టయితే అందులో కర్ణాటక, మహారాష్ట్రలకు కూడా వాటా ఉంటుందని బచావత్ అవార్డులోనే ఉంది. కాబట్టి గోదావరి నుండి కృష్ణకు 200 టి.ఎం.సిలు తరలిస్తే, కృష్ణలో ఎగువ నుండి వచ్చే 200 టి.ఎం.సిలలో పెద్ద భాగం ఆ రాష్ట్రాలు ఎగువనే నిలిపేసుకోవచ్చు. వరద నీరు బాగున్న సంవత్సరాలలో ఈ

తేడా కనిపించకపోవచ్చును గానీ వర్షాభావ సంవత్సరాలలో కనిపిస్తుంది. మిగులు జలాల ప్రాజెక్టులు నీటికి ఎండడం, వాటిపైన ఆధారపడ్డ ప్రజలు ఘర్షించుకోవడం జరుగుతుంది. ఏ రకంగా చూసినా కృష్ణా నదీజలాల కేటాయింపునూ, భరోసానూ కూడా పున:పంపిణీ చేయడమొక్కటే హేతుబద్ధమైన పరిష్కారం. కానీ మన రాష్ట్ర ప్రభుత్వం దానికి ఎంతమాత్రం సిద్ధంగా లేదు.

నదీజలాలతో పాటు ఈ ప్రచురణలోని కరపత్రాలలో తరచుగా వినిపించేది వలస బతుకుల దైన్యం. మహబూబ్‌నగర్ జిల్లా ఒక్క మన రాష్ట్రంలోనే కాదు, దేశమంతటా వలసల విషయంలో పేరుపడింది. జనాభాలో మూడవవంతు 'జానెడు పొట్టకోసం, మూరెడు బట్ట కోసం దిక్కుల చివరిదాకా' వలసపోయే జిల్లా ఇది. ఎప్పుడయినా ఎక్కడయినా అసంఘటిత కార్మికుల హక్కులకు గుర్తింపు, రక్షణ కరువన్నది సత్యం కాగా, వలస కార్మికుల పరిస్థితి మరీ అధ్వాన్నం. వారు పనిచేసే ప్రతిచోటా పరాయివారే. తరచుగా స్థానిక భాష సహితం వారికి పరాయి భాషే. కట్టుబానిసలుగా వచ్చి కట్టుబానిసలుగా పనిచేసి ప్రాణం మిగిలి ఉంటే పని  అయినాక వెనక్కి పోతారు. ఊరినుండి తీసుకుపోయిన మేస్త్రీ గాని,  పరాయి ప్రాంతంలో పని చేయించుకునే కాంట్రాక్టర్ గాని తమకు కూలి ఇయ్యకపోయినా తిండి పెట్టకపోయినా శారీరకంగా హింసించినా రోగమొచ్చిన, రొష్టు వచ్చినా పట్టించుకోకపోయినా ఎవరికీ ఫిర్యాదు చేసుకోలేరు, న్యాయం పొందలేరు. అంతర్ రాష్ట్ర వలస కార్మికుల చట్టం అనేదొకటి ఉన్నా, అందులో వలస కార్మికుల హక్కులకు కొంత రక్షణ కల్పించే అంశాలున్నా, ఆ చట్టం అమలు ఇతర కార్మిక చట్టాల కంటే కూడా అధ్వాన్నంగా ఉంది.

ఏకరవు పెట్టుకుంటూ పోతే కరువుకు చాలా పార్శ్వాలున్నాయి. స్త్రీలు, పిల్లలు, దళిత కులాలు అనుభవించే అణచివేతకూ కరువు పార్శ్వం ఉంటుంది. అవన్నీ సవివరంగా కరువు వ్యతిరేక పోరాట కమిటీ తన కరపత్రాల ద్వారా ప్రచారంలో పెట్టిన డిమాండ్లలో కనిపిస్తాయి. ఇతర కరువు ప్రాంతాలలో జరుగుతున్న, జరగవలసిన ఆందోళనలకు ఈ కృషి మార్గదర్శకంగా ఉండగలదు. ప్రాంతాన్ని బట్టి, పరిస్థితులలో స్థానికంగా ఉ ండే తేడాను బట్టి, ఫిర్యాదులలోనూ, పరిష్కారాలలోనూ కొంత వైవిధ్యం ఉండవచ్చును గానీ కరువుకు వ్యతిరేకంగా చేపట్టే ఆందోళన ఎంత వివరంగా అధ్యయనం చేయాలి, ఎంత లోతుగా పరిశీలన చేయాలి, ఎన్ని జీవిత పార్శ్వాలను తాకే డిమాండ్లనూ

సూచనలనూ ప్రభుత్వం ముందు, సమాజం ముందు పెట్టాలి అన్నదానికొక మంచి ఉదాహరణగా మహబూబ్‌నగర్ జిల్లాలో జరిగిన ఈ కృషి నిలిచిపోతుంది. దానికి అద్దం పట్టే ఈ ప్రచురణ తీసుకొచ్చినందుకు కరువు వ్యతిరేక పోరాట కమిటీకి అభినందనలు.

*గొంతెత్తిన పాలమూరు : కరువు వ్యతిరేక పోరాట కమిటీ ఉద్యమ కరపత్రాలు*
*1998-2005కు రాసిన ముందుమాట*
*సెప్టెంబర్ 2009*

# బాలగోపాల్ పుస్తకాలు

- ప్రాచీన భారతదేశ చరిత్ర
  –డి.డి. కోశాంబి పంరిచయం
- హక్కుల ఉద్యమం–తాత్విక దృక్పథం
- రాజ్యం – సంక్షేమం
- మతతత్వంపై బాలగోపాల్
- రూపం – సారం : సాహిత్యంపై బాలగోపాల్
- దళిత
- రిజర్వేషన్లు – ప్రజాస్వామిక దృక్పథం
- జలపాఠాలు
- మనిషి – మార్క్సిజం
- ముస్లిం ఐడెంటిటీ – హిందూత్వ రాజకీయాలు
- నిగాహ్–1 (1998–2003)
- నిగాహ్– 2 (2003–2009)
- ఆ శిక్షే ఒక నేరం
- పాలస్తీనా ప్రజా పోరాటం
- అభివృద్ధి–విధ్వంసం
  భూమి, భావజాలం, కోర్టులు, కోస్టల్ కారిడార్

- ఆదివాసులు :
  ఛత్తీస్‌గఢ్, కంధమాల్‌పై వ్యాసాలు, నివేదికలు
- ఆదివాసులు :
  వైద్యం సంస్కృతి అణచివేత
- సైన్స్ వ్యాసాలు
- చరిత్ర రచనపై బాలగోపాల్
- Leaders Beyond Media Images
- Of Capital and Other Punishments
- Democracy Dialogues (CD & DVD)
- Ear to the Ground

# మట్టి ముద్రణలు

| | | | |
|---|---|---|---|
| 1 | రంఘం | – వేనేపల్లి పాండురంగారావు<br>లైంగిక విజ్ఞానం–శృంగార సమాచారం | – 1997 |
| 2 | జల్‌జలా | – ముస్లింవాద కవితా సంకలనం | – 1998 |
| 3 | పట్నం వచ్చిన పల్లె | – భూపాల్<br>తెలంగాణ బతుకు కథల నవలిక | – 1988 |
| 4 | ఎవరీ పనిపిల్ల | – తుమ్మేటి రఘోత్తమరెడ్డి<br>'పనిపిల్ల' కథపై చర్చ | – 2003 |
| 5 | ఏశకాంత | – సంపతి సోమయ్య<br>(తెలంగాణ దళిత కవిత్వం) | – 2006 |
| 6 | పహెచాన్ | – గీతాంజలి<br>(ముస్లిం స్త్రీల అస్థిత్వం కథలు) | – 2007 |
| 7 | నన్హే ఓ నన్హే (నానీలు) | – అనిశెట్టి రజిత | – 2007 |
| 8 | తెలంగాణ కవిత –2007 | – సంపాదకులు: సుంకర రమేష్ | – 2007 |
| 9 | ఇరుసు | సంపాదకులు: కాసుల ప్రతాపరెడ్డి<br>(తెలంగాణ సాహిత్య వ్యాసాలు) | – 2008 |
| 10 | తెలంగాణ కవిత – 2008 | – సంపాదకులు: సుంకర రమేష్ | – 2009 |

| | | | |
|---|---|---|---|
| 11 | తెలంగాణ సామెతలు-జాతీయాలు | - సంపాదకులు: కర్ర ఎల్లారెడ్డి | |
| 12 | కావడి కుండలు | - సీమాంధ్ర కవుల తెలంగాణం<br>సంపాదకులు: కోయి కోటేశ్వరరావు | - 2010 |
| 13 | తెలంగాణ కవిత - 2009 | - సంపాదకులు: సుంకర రమేష్ | - 2010 |
| 14 | తెలంగాణ వెతలు | - బోయ జంగయ్య కథలు | - 2011 |
| 15 | తెలంగాణ కవిత - 2010 | - సంపాదకులు: సుంకర రమేష్ | - 2011 |
| 16 | పాటల ఊట | - పయిలం సంతోష్ | - 2012 |
| 17 | జలపాతాలు | - కె. బాలగోపాల్ | - 2013 |
| 18 | ఆమె | - చైతన్య ప్రకాశ్ | - 2015 |
| 19 | రేణ | - చైతన్య ప్రకాశ్ | - 2015 |
| 20 | దుగిలి (దళిత కవిత్వం) | - భూతం ముత్యాలు | - 2015 |
| 21 | దిద్దుబాటు (కథలు) | - డా. పైడిపాల | - 2015 |
| 22 | బొమ్మలబాయి (కవిత్వం) | - సిద్ధార్థ | - 2015 |
| 23 | తీగో నాగో ఎన్నియలో (గేయ కవిత్వం) | - చింతల యాదగిరి | - 2016 |
| 24 | కొన్ని తెలంగాణ వ్యాసాలు | - కె. బాలగోపాల్ | - 2016 |


మట్టి ముద్రణలు

ఆలగడప, నల్లగొండ జిల్లా, తెలంగాణ-508207

9848015364

KONNI TELANGANA VYAASAALU ● K. BALAGOPAL



అభివృద్ధిని సమానంగా పొందే హక్కు ఒక ప్రజాస్వామిక హక్కు. వనరులున్నచోట ఆ వనరులను ఉపయోగించి, లేనిచోటికి వాటిని తరలించి, ఆయా ప్రాంతాలు ఏ విషయంలో వెనుకబడి ఉన్నాయో ఆ విషయాలపైన ప్రత్యేక దృష్టి పెట్టి, అన్ని ప్రాంతాలూ ఒకదాని సరసన ఒకటి నడిచేటట్టు అన్నిటినీ అభివృద్ధి చేసినప్పుడే 'మనమందరమూ ఒకటే'ననే భావన ఒక పెత్తందారీ భావన కాక ప్రజాస్వామిక భావన అవుతుంది.

*

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఎందుకు అన్న ప్రశ్నకు జవాబును ప్రస్తుత రాజకీయ నీతి ఆమోదించే కారణాల చట్రంలోనే వెతుక్కోవడం తప్పనిసరి అని తెలంగాణ వాదులు భావించడం అనవసరమేమో. అలా భావించడం వల్లనే తరచుగా కృత్రిమ తర్కాన్ని ఆశ్రయించడం జరుగుతున్నది. రైతాంగం దేశవ్యాప్తంగా ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని తెలంగాణకు ప్రత్యేకమైన సమస్యగా చూపించడం, దేశ రాజకీయార్థిక విధానాలలో నెలకొన్న వైపరీత్యాల పర్యవసానాలయిన నిరుద్యోగం వంటి సమస్యలను రాష్ట్ర పాలనా విధానాలలోని వివక్ష ఫలితమని వాదించడం వింటున్నాం. సార్వజనీన సమస్యలకు ప్రత్యేకమైన కోణాలుంటాయి, ఉండవని కాదు. వివక్ష ఉన్నచోట అవి మరింత తీవ్రమూ అవుతాయి, కావని కాదు. కాని ఆ ప్రత్యేకత పాలు ఎంత అనే హేతుబద్ధమైన వివేచనకు సున్నితమైన విశ్లేషణ కావాలి. అది కొరవడినచోట దబాయింపు గోచరించే ప్రమాదం ఉంది.

మట్టి ముద్రణలు
ఆలగడప • తెలంగాణ